శ్రీ రమణ మహర్షుల యుపదేశవాక్కులు గల

# ఉన్నది నలుబది - సద్విద్య

అనుబంధములతో

శ్రీ రమణాశ్రమము
తిరువణ్ణామలై

శ్రీ రమణ మహర్షుల యుపదేశవాక్కులు గల

# ఉన్నది నలుబది - సద్విద్య

(అనుబంధములతో)

[వచన శ్లోక ద్విపద వృత్త సముచ్చయము]



(రెండవ కూర్పు)

ప్రకాశకులు:

శ్రీ నిరంజనానంద స్వామి

సర్వాధికారి

శ్రీ రమణాశ్రమము

తిరువణ్ణామలై



1941

# ప రి చ య ము .



ఈ అరుణాచల క్షేత్రమున జ్ఞానతేజోమూర్తులై వెలయు భగవాన్ శ్రీ రమణమహర్షులు, భక్తులు వేడుకొనగా ద్రావిడమున "ఉళ్లదునార్పదు" (ఉన్న సత్పదార్థమును గూర్చి నలుబది పద్దెములు అని అర్థము) ను అనుగ్రహించిరి. వాని అనువాదమే ఈ గ్రంథము. ఇందలి వచనము శ్రీ యోగి రామయ్యగారు కోరఁగా శ్రీభగవానులచే స్వయంవిరచితము. ఇదిగాక శ్లోకములందును తెలుఁగు వృత్తములందును శ్రీభగవానుల రచనలు కతిపయములు కలవు.

కడమభాగము భగవద్భక్తులచే అనువదింపఁబడినది. అందు "ఉన్నది నలుబది" శ్లోకములు శ్రీకావ్యకంఠగణపతిమునిరచనము. "అనుబంధము" శ్లోకములు కొన్ని శ్రీలక్ష్మణశర్మగారి రచనము. "సద్విద్య" ద్విపద శ్రీ బ్ర॥ లక్ష్మీనరసింహారావుగారిచేతను, వృత్తములు శ్రీ సోణాకాశేషురెడ్డిగారిచేతను, "సూక్తిసుధ" ద్విపద శ్రీకృష్ణకౌండిన్యులచేతను రచింపఁబడినవి. "సూక్తిసుధ" వృత్తములు కొన్ని లక్ష్మీనరసింహారావుగారి రచనము, కొన్ని శేషురెడ్డిగారి రచనము.

# ఉన్నది నలుబది

## ఉపోద్ఘాతము.

1. సద్వస్తులక్షణమును దానినొందు నుపాయమును మేము తరించుటకై మాకుఁ జెప్పుమని మురుగఁ డర్థింపఁగ, ఘనుఁడైన శ్రీరమణుఁడు సంతసించి, అసత్యమైన జగజ్జాలము అంతమొందుచందమున "ఉన్నది నలుబది" ని సంగ్రహించి వచించెను.

శ్లో॥ సద్దర్శనం ద్రావిడ వాఙ్నిబద్ధం
మహర్షిణా శ్రీరమణేన శుద్ధం
ప్రబన్ధ ముత్కృష్ట మమర్త్యవాణ్యా
మనూద్య వాసిష్ఠమునిర్వ్యతానీత్॥

## మంగళము.

1. ఉన్నది అనఁగా జ్ఞానరూపమైయుండు వస్తువు లేక, ఉన్నట్లు దోఁచు జ్ఞానము ఉండఁగలదా? ఆ సద్వస్తువు తలంపేదియు లేక తలంపునకు మూలమైన హృదయ మను పేరుగల యాసత్యవస్తువును దలంచుట యెటులు? హృదయమం దది యుండునట్లు మన ముండుటయే స్మరణము.

# సద్విద్య

## ఉపోద్ఘాతము.

ద్వి॥ అరుణాచలరమణుఁ డనుభవగురుఁడు
కరుణ నఱవమునఁ గన్న గ్రంథముల
"ఉన్నది నలుబది" నున్న భావములు
గొన్నది తెలుఁగున మిన్న "సద్విద్య" ॥

క॥ సద్వస్తు లక్షణం బెది?
విద్వన్నుత, దానిఁ బొందు విధమెయ్యదియో?
సద్వికసన మగులాగున
సద్విద్యను మాకు బోధ సలుపుము, తండ్రీ ॥

క॥ అని మురుగఁడు ప్రార్థింపఁగ,
విని రమణుఁ డసత్యమైన విశ్వముఁ ద్రోయన్
దనుఁ దా నెఱిఁగెడు మార్గముఁ
గన "నున్నది నలుబది" యను గ్రంథమొసఁగెన్

## మంగళము.

ద్వి॥ ఉన్నది యొక్కటి యుండక యున్న
ఉన్నట్లు దోఁచుచేనుండుట కలదె?
ఉన్నది తలఁపెద్ది యుండక తలఁపు
లన్నిటికిని మూలమగు హృదయమున
నున్నదాన హృదయ మెన్ను టెట్లువఁడు?
ఉన్నట్లు హృదిమనముండుటే స్మరణ ॥

శ్లో॥ సత్ప్రత్యయాః కిన్ను విహాయ సన్తం ?
హృద్యేష చిన్తారహితో హృదాఖ్యః ;
కథం స్మరామ స్తమమేయ మేకం ?
తస్య స్మృతి స్తత్ర దృఢైవ నిష్ఠా. ॥

2. మరణభయ మధికమైన యా పురుషులు భవ మరణ రహితమగు మహేశ్వరుని చరణములనే శరణముగఁ బొందఁగలరు. తమ సంగములతోఁ దామును జేచ్చి అనఁగా మమతాహంకారములు నశించి చేవులేక స్వరూపమై వెలుఁగువారు మరల మరణచింత నొందఁగలరా ?

శ్లో॥ మృత్యుంజయం మృత్యుభియా శ్రితానా ;
మహంమతి ర్మృత్యు ముపైతి పూర్వాం;
అథ స్వభావా దమృతేషు తేషు
కథం పున ర్మృత్యుధి యోఽవకాశః ? ॥



చ॥ కలయదిలేక యున్నటులు గన్పడు జ్ఞానము గల్గుచుండు నా?
తలఁ పిసుమంత లేని నిజతత్త్వము నిశ్చలమూలమైన హృ
త్స్థలమున నుంటఁ దా హృదయసంజ్ఞ సమాఖ్యము; దాని సేవిధన్
దలఁతుము? దానిఁబోలి యటఁ దా నిలువన్ స్మరణంబగున్ జుమీ॥

ద్వి॥ మరణభీతిని జెందు మానవు లిలను
మరణభవరహిత పురనిర్మథనుని
చరణమే పొందఁగలరు శరణముగ;
మరణింపఁగ నహముఁ జిరసంగములును,
మరణహీనబ్రహ్మమయులగువారు
మరల నొందఁగలరె మరణ చింతనను?॥

చ॥ మరణభయార్తులౌ పురుషమానులు చావుభవంబులేని శం
కరుని కృపాశరణ్యతను గాంతురు శ్రేయము; సంగమూలతో
మరణమునొందఁగా నహ, మమారణులౌచు స్వరూపమై సదా
పరఁగెడువారు చావునకు వంతను జెందుదురా? వచింపుమా॥

# గ్రంథము

1. మనము లోకమున్నట్లు గనుటవలన బహువిధ శక్తులుగల యొక కారణకర్త కలఁడని యొప్పుకొనుట యందఱంగీకరింపఁ దగినది. నామరూపచిత్రములు, చూచేవారు, ఆధారవస్త్రము, వెలిగించే వెలుఁగు, ఇవి యన్నియుఁ దానే యగువాఁడు.

శ్లో॥ సర్వైర్నిదానం జగతోఽహమశ్చ
వాచ్యః ప్రభుః కశ్చి దపారశక్తిః;
చిత్రేఽత్ర లోక్యంచ విలోకితాచ
పటః ప్రకాశోఽప్యభవత్స ఏకః॥

2. జగత్తు జీవుఁడు ఈశ్వరుఁడు అను మూఁడు వస్తువులనుబట్టియే ఏ మతమును ఆరంభించేను. ఒక వస్తువే మూఁడగును. ఎప్పుడును మూఁడు మూఁడే అనుట అహంకారముండువఱకే. కనుక "నేను" (అహంకారము) చేచ్చి, తన స్థితిలోఁ దానుండుట యుత్తమము.

శ్లో॥ ఆరభ్యతే జీవజగత్పరాత్మ
తత్త్వాభిధానేన మతం సమస్తం;
ఇదంత్రయం యావదహంమతిస్స్యాత్,
సర్వోత్తమాఽహంమతిశూన్యనిష్ఠా॥

3. జగత్తు సత్యము కాదు అది మిథ్యాదృశ్యము, లోకము జ్ఞానము కాదు, జగము సుఖము కాదు, అని

## గ్రంథము.



ద్వి॥ ఇల మనము గనుటవలన నున్నట్లు
పలువిధముల శక్తిగల మూలకర్త
కలఁడని యొప్పంగ వలయునుగాదె;
నిలుచే చిత్రపటము వెలిఁగించె వెలుఁగ
ఖిలము తానేయగు కేవలుఁ డతఁడు ॥

మ॥ కనుచున్ సాంగముగాఁ బ్రపంచకమునున్ గాఢ్యంబుగాఁ బెట్టి, దా
నిని సర్వజ్ఞుఁ డొకండు కర్తయయి తా నిర్మించె, నాతండు గా
పనియున్ గర్తయు మూలవస్తువనుచున్ భావింతు రాద్యుల్; పటం
బును నందుండెడు వస్తువుల్ వెలుఁగు చూపుల్ బూనుచున్నాఁ డాతఁడే॥

ద్వి॥ కన జగజ్జీవేశులను మూఁటిమూల
మునుబట్టి యేమతమును ముందు నిలుచె;
అనయమ్ము మూఁడుమూఁడని మూఁడు నొకటి
యనుట యహంకార మలరెడువఱకె;
కనుక నహమడఁగి తనయందు తాను
అనయముండెడుస్థితి యది యుత్తమంబు ॥

చ॥ భువనము జీవుఁ డీశుఁ డను పుంతనుబట్టియె యేమతమ్ము ను
ద్భవమగు; వస్తువొక్కటియె భవ్యము మూఁడగు; మూఁడు నష్టమౌ
అవుఁగద మూఁడుగాననుట యాయహమంతయునుండునంతె;
శివమగు నాయహమ్మణఁచి శీఘ్రమె తానుగఁ దాను నిల్చినన్ ॥

ద్వి॥ జగమిది సత్యమో సత్యము కాదో?
జగమిది జ్ఞానమో జ్ఞానము కాదో?

పలికి లాభమేమి? జగద్దృష్టితోలంగి, తన్నుఁ దా నెఱింగి, యొకటి రెండును మాని "నేను" లేని స్థితి సర్వసమ్మతము.

శ్లో॥ సత్యం మృషా వా, చిదిదం జడం వా
దుఃఖం సుఖం వేతి ముధా వివాదః
అదృష్టలోకా నిరహంప్రతీతి
ర్నిష్ఠాఽవికాల్పా పరమాఽఖిలేష్టా ॥

4. తాను రూపమైనచో నైన జగదీశ్వరులును అట్లే కావచ్చును. తాను రూపము కానియెడల వానిరూపము నెవ్వరెట్లు చూడఁగలరు? కన్నులేక కనఁబడుట కలదా? తానే కన్ను; అదియో తుదిలేని కన్ను.

శ్లో॥ సరూపబుద్ధి ర్జగదీశ్వరేచ
సరూపధీరాత్మని యావదస్తి;
అరూప ఆత్మా యది కః ప్రపశ్యేత్
సాదృష్టిరేకాఽనవధిర్హి పూర్ణా ॥

5. దేహము పంచకోశాకారము. కనుక దేహమను పదములో నైదును అణఁగును. దేహము లేక లోకమున్నదా? దేహము లేకయే లోకమును గన్నవారు కలరా? చెప్పుము.

జగము సుఖంబౌనో జగము దుఃఖంబో?
తగవు లాడుటయందు తగుఫల మేమి?
మాని జగద్దృష్టి, మాని రెండొకటి,
"నేను" లేనిస్థితియె నిఖిలసమ్మతము॥

ఉ॥ వాదులు సత్యమా జగము వమ్మది మిథ్యయొ, జ్ఞానమా సుఖం
బేదియుఁగా దటంచనఁగ నేమిఫలంబగు? దృశ్యముంగు నా
పాదితవిశ్వముం దొలఁచి, బాగుగఁ దా దను నెర్గి, గొందుగెం
జేదియు, "నేను" లేనిదగు నిస్థితి నందఁగ సమ్మతింపరే?॥

ద్వి॥ రూపము తానైన, రూపముతోఁచు
నాపరమాత్మకు నఖిలమునకును;
తాను రూపము గానిచో, నెవ్వ రెట్లు
వాని రూపమ్మును గానఁగాఁ గలరు?
మాని చూపును దృశ్యభానము గలదె?
తానె చూ, పద్దియో దరిలేని చూపు॥

చ॥ అరసెడు తాను రూపుఁ డయినట్లయినన్, భువనమ్ము నీశుఁడున్
వరుసగ నట్టివారె యనవచ్చును; భౌతికరూపహీను డె
వ్వరు నెటు వానిరూపములవైఖరిఁ జూచుట? కన్ను లేక రూ
పరయఁగనౌనె? తానయన, మద్దియె తాఁ దుదిలేని కన్నగున్॥

ద్వి॥ తను వైదుకోశాల నణఁగిన దానఁ
దనువను పదమునం దణఁగు నీద్వయము;
తనువు లేక కలదె తనకు జగమ్ము?
తనువు లేకెవరైనఁ గనిరొ జగమ్ము?॥

శ్లో॥ యత్పఞ్చకోశాత్మక మస్తిదేహం
తదన్తరా కిం భువనంచకాస్తి ?
దేహంవినా పఞ్చవిధం తదేతత్
పశ్యన్తి కేవా భువనం? భణన్తు॥

6. లోకము పంచవిషయాత్మకము, వేఱుకాదు. ఆ పంచవిషయములు పంచేంద్రియగోచరములు. ఆ పంచేంద్రియముల మూలముగ ఒకమనస్సే లోకమును ఎఱుంగుటచేత లోకము మనస్సే యగును. మనస్సులేక లోకము కలదా? చెప్పుము.

శ్లో॥ శబ్దాదిరూపం భువనం సమస్తం
శబ్దాది సత్తేన్ద్రియ వృత్తిభాస్యం;
సత్తేన్ద్రియాణాం మనసోవశేస్యాత్;
న్మనోమయం తద్భువనం; వదామః॥

7. లోకము, జ్ఞానము ఇవి యేకముగఁబుట్టి నశించినను, జ్ఞానముచేతనే లోకము వెలుఁగును. లోక జ్ఞానములకు భవ లయ (పుట్టు నశించే) స్థానమై భవ లయములు లేక వెలుఁగు పరిపూర్ణమైనదియే ఆ వస్తువు.

శ్లో॥ ధియాసహోదేతి ధియాఽస్తమేతి
లోకస్తతోధీ ప్రవిభాస్య ఏషః;
ధీ లోక జన్మ క్షయధామపూర్ణం
సద్వస్తు జన్మక్షయశూన్యమేకం॥

తే-గీ॥ పంచకోశ స్వరూపమై పరఁగు దేహ;
మందుచే దేహమన్ పదమందు నైగు
నణఁగు; దేహంబు లేకయే యవని కలదె?
కాయ మదిలేక లోకమున్ గాంచి రెవరు?॥

ద్వి॥ పంచవిషయకరూపమ్మె జగమ్ము;
పంచేంద్రియములద్వారాన మది ప్ర
పంచము నెఱుఁగుటంబట్టి, మనమును
మించియుఁ గలదె ప్రపంచము? చెప్పుము॥

తే-గీ॥ పంచవిషయాత్మకం బీ ప్రపంచ; మైన
ఇంద్రియములకు విషయమ్ము లెఱుఁగ నౌను;
ఏకమానసమే భువి నింద్రియములఁ
వలనఁ గనును; మనసులేక గలదె జగము?॥

ద్వి॥ లోక బోధము లివి యేకమై పుట్టి
యేకమై నశియించు; నిది యనుభూతి।
యైనను భువనమ్ము జ్ఞానభాస్యమగు
వీనికి భవ లయ స్థానమగుచును;
ఉదయాస్తమయముల నొందక వెలుఁగు
నదియె సంపూర్ణమైనది వస్తువగును

ఉ॥ జ్ఞానము లోక మేకముగఁ గల్గు నశించెడి; [illegible]
జ్ఞానముచేఁ బ్రకాశితము; జ్ఞానము లోకము పుట్టగిట్టఁగా
స్థానము తానెయై భవము సంత[illegible] [illegible]
తా నెది పూర్ణమై వెలుఁగుఁ దత్త్వము [illegible]॥

8. ఏ పేరునుబెట్టి ఏ రూపమున నెవ్వరు భజించి నను, అది యా నామరూపరహిత పరిపూర్ణవస్తు దర్శనమునకు దారియైనను, ఆ సద్వస్తు తత్త్వమున తన యథార్థము నెఱింగి శాంతినొంది తన్మయమగుటయే సత్య దర్శనము.

శ్లో॥ భవన్తు సద్దర్శనసాధనాని
పరస్య నామాకృతిభిఃసపర్యాః
సద్వస్తుని ప్రాప్తతదాత్మభావా
నిష్ఠైవ సద్దర్శన మిత్యవేహి॥

9. ద్వంద్వములు, త్రిపుటులు ఇవి యెప్పుడును ఒకదాని నాశ్రయించి యుండునవి. అది యెదియని వెదకి మనస్సులోఁ జూడఁగ నవి వీడును; చూచినవారే తత్త్వమును జూచినవారు, కలఁత నొందనివారు.

శ్లో॥ ద్వన్ద్వాని సర్వాణ్యఖిలాస్త్రిపుట్యః
కించిత్సమాశ్రిత్యవిభాన్తి వస్తు;
తన్మార్గణేస్యాద్గలితం సమస్తం,
నపశ్యతాం సచ్చలనం కదాఽపి.॥

10. అజ్ఞానములేక జ్ఞానములేదు; జ్ఞానములేక

ద్వి॥ ఏనామమున నెవ శేరూపమునను
ధ్యానించిన, నది నామాకృతుల్ లేని
సత్యవస్తువుఁజూడ సాధనమైన,
సత్యవస్తువుయొక్క సత్త్వమునఁ దన
సత్యము నెఱిఁగి తా శాంతుఁడై యంగు
నిత్య ముండెడు నిష్ఠ నిజదర్శనమ్ము ॥

సీ॥ అంతటఁ బరిపూర్ణమై వెలుంగుచునుండు-నదియె సద్వస్తువౌ; నట్టి దాని
శేరూపుఁగల్పించి యేపేరు నిడి భక్తి-నేరీతి నర్చింతు రేని, యట్టి
పూజనంబులు, పరిపూర్ణమై నామరూ-పక్రియారహితమై పరఁగునట్టి
సత్యవస్తువుయొక్క సందర్శనమునకు-మార్గమేయైనను; మాటలుడిగి

తే॥ యట్టి సద్వస్తు తత్త్వంబు నరసి, దానఁ
దన యథార్థంబు నెఱిఁగి శాంతమును బొంది
తన్మయుం డగుటయె సత్యదర్శనంబు;
సాధనముచేత నయ్యది సాధ్యపడును ।

ద్వి॥ రెండును త్రిపుటులు నుండు నొండొక్క
యుండను; లోన నే దని యాయొకటిని
వెదకి చూడఁగ నవి వీడును; తత్త్వ
విదులు చూచినవారు వదలిరి కలఁత. ॥

తే॥ గీ॥ అరయఁ ద్రిపుటులు ద్వంద్వంబు లాశ్రయించి
యుండు నొకదాని; నది యెద్దియో మనమున
వెదకి చూడంగ నవి వీడు; వెదకి కనిన
వారె తత్త్వజ్ఞులు, కలఁత వదలినారు. ॥

ద్వి॥ ఎఱుఁగమిని విడిచి యెఱుకయు లేదు;
ఎఱుకను విడిచి యా యెఱుఁగమి లేదు;

అజ్ఞానములేదు. ఆ జ్ఞానాజ్ఞానము లెవ్వరికని అన్వేషించిన తన్నుఁ దాను దెలియు జ్ఞానమే జ్ఞానమగును.

శ్లో॥ విద్యాకథం భాతి నచేదవిద్యా?
విద్యాం వినా కిం ప్రవిభాత్యవిద్యా?
ద్వయంచ కస్యేతి విచార్య, మూల
స్వరూపనిష్ఠా పరమార్థవిద్యా॥

11. ఎఱిఁగెడు తనను ఎఱుఁగక యితరము నెఱుఁగుట యజ్ఞానమే గాని జ్ఞానమగునా? జ్ఞాన ఇతరముల కాధారమైన తనను ఎఱింగినచో జ్ఞానాజ్ఞానములు నశించేను.

శ్లో॥ బోద్ధారమాత్మాన మజానతో యో
బోధః స కింస్యా త్పరమార్థ బోధః?
బోధస్య బోధ్యస్యచ సంశ్రయం స్వం
విజానత స్తద్ద్వితయం వినశ్యేత్.॥

12. జ్ఞానాజ్ఞానములులేనిదే జ్ఞానమగును. ఎఱుఁగునది యథార్థజ్ఞానము కాదు. ఎఱుఁగుటకును ఎఱిఁగించుటకును అన్యము లేక తాను వెలుఁగుటవలననే జ్ఞానమగును. శూన్యము కాదని యెఱుఁగుము.

శ్లో॥ నిద్రా న విద్యా, గ్రహణం న విద్యా;
గృహ్ణాతి కించి న్న యథార్థబోధే;

ఎఱుక యెఱుఁగమి యెవ్వరికని మూల
పురుషుఁడౌ తనను దా నెఱుఁగుటే యెఱుక. ॥

కం॥ జ్ఞానములే కజ్ఞానము
జ్ఞానం బజ్ఞతయులేక కలుగవు; మఱి యా
జ్ఞానాజ్ఞానములకు మొద
లే నని తనుఁ దా నెఱుంగుటే జ్ఞానముగన్. ॥

ద్వి॥ ఎఱుఁగు తన్నెఱుఁగక యితరము నెఱుఁగు
టెఱుఁగమియేగాని యెఱుక యగునె?
ఎఱుక కితరమున కిల్లగు తనను
ఎఱుఁగఁగఁ దెగిపోవు నెఱుక యెఱుఁగమి. ॥

తే॥ గీ॥ ఎఱుఁగు తన్నెఱుఁగ కితర మెఱుఁగు జ్ఞాన
మెఱుఁగమిని జేరునేగాని యెఱుకయగునె?
జ్ఞాన తదితరములకును స్థానమైన
తన్నెఱుంగఁగ నవి రెండు తామె పోవు. ॥

ద్వి॥ ఎఱుక కెఱుఁగమికిఁ బరమగునదియె
యెఱుకయగా; నెఱుఁగునదే సత్యమైన
యెఱుక కానేరద; యెఱుఁగుటకైన
నెఱిఁగించుటకునైన నితరము లేక
తానె వెలుఁగుటచే జ్ఞానమా నదియె;
కాని శూన్యమగునె? కాదు, తెలియుము. ॥

తే॥ గీ॥ జ్ఞానమజ్ఞానమును లేమి జ్ఞానమగును;
ఎఱుఁగునది కాదు సజ్ఞాన; మెఱుఁగుటకును

నిద్రాపదార్థగ్రహణేతరాస్యా
చ్చిదేవవిద్యా విలసత్యశూన్యా. ॥

13. జ్ఞానమైన తానే సత్యము. నానాకారజ్ఞానము అజ్ఞానము. అసత్యమైన యీ జ్ఞానమును సత్యజ్ఞానమైన తనకన్న వేఱులేదు. పలుతెగల నగలు సత్యముకావు. అవి సత్యమైన బంగారమును వదలి యుండఁగలవా? చెప్పుము.

శ్లో॥ సత్యశ్చిదాత్మా, వివిధాకృతిశ్చిత్
సిద్ధ్యేత్పృథక్సత్యచితో న భిన్నా;
భూషా వికారాః కిముసన్తిసత్యం
వినాసువర్ణం పృథగత్రలోకే ॥

14. "నేను" అను నుత్తమపురుషము ఉండినస్తైన, "నీవు" "వాఁడు" అను మధ్యమ ప్రథమపురుషములును ఉండును. ఉత్తమపురుషతత్త్వమును ఎఱుంగుటచేత "నేను" లేకపోఁగా, అవియులేక, యేకమై వెలుఁగునదియే తన స్వభావస్థితి యగును.

శ్లో॥ తద్వ్యష్టదో ర స్మది సంప్రతిష్ఠా;
తస్మిన్ వినష్టేఽస్మది మూలబోధాత్,
తద్వ్యష్ట దస్మన్మతి వర్జితైకా
స్థితిర్జ్వలన్తీ సహజాత్మన స్స్యాత్ ॥

ఎఱుకఁగలిగించుటకును లేకెదియు, తానె
వెలుఁగు జ్ఞానము ; శూన్యము వెలుఁగదుగద. ॥

ద్వి॥ జ్ఞానమా తానె నిజము ; బహురూప
జ్ఞాన మజ్ఞానమే ; సత్యముకాని
జ్ఞాన మదియును సజ్ఞాన మౌ తనను
మానివేఱునుగాదు తాను చూడంగ ;
పలు తెగనగలు నబద్ధ, మవియును
గలవె వేఱుగ సత్యకాంచనమునకు ? ॥

శా॥ జ్ఞానం బేకము తానె సత్య; మరయన్ నానాకృతిజ్ఞాన ము
జ్ఞానంబౌ; నది మిథ్య; యట్లగు మృషాజ్ఞానంబునున్ సత్యము
జ్ఞానంబౌ తన కన్య మౌనె? నగలున్ నానాకృతుల్ గల్ల, యెం
దైనన్ గల్గునఁటయ్య వీడియును సత్యంబైన బంగారమున్? ॥

ద్వి॥ ఉన్నచో "నేన"ను నుత్తమపురుష
మున్నవి "నీ"వని యున్న మధ్యమము
మఱి "వాఁ"డను ప్రథమపురుష మదియును;
ఎఱుఁగంగ నుత్తమపురుషతత్త్వమును,
లేకపోఁగా నేను, లేక యవియును,
ఏకమై వెలుఁగుటయే స్వస్థితియగు ॥

ఉ॥ ఉండెనయేని "నే" ననెడు నుత్తమపూరుష, 'మీవు' 'వాఁడు' నా
నుండును మధ్యమప్రథమ; లుత్తమపూరుషతత్త్వమున్ గనన్,
ఉండదు "నేను"; తత్క్షణమ యుండక పోవును "నీవు" "వాఁడు"; తా
నిండివెలుంగు నేక మెది నిక్క మదే తన నైజరూపమౌ ॥

15. వర్తమానమునుబట్టియే భూతభవిష్యత్కాలములు నిలుచును. అవియును (ఆ భూతభవిష్యత్కాలములును) వానివాని కాలములందు వర్తమానమే యగును. కనుక వర్తమాన మొకటియే కలదు. "ఇప్పుడు" తత్త్వ మెఱుఁగక భూతభవిష్యత్తుల నెఱుఁగఁదలంచుట ఒకటి లేక యొంచెఁ దలంచుటయే యగును.

శ్లో॥ భూతం భవిష్యచ్చ భవత్స్వకాలే;
తద్వర్తమానస్య విహాయ తత్త్వం,
హాస్యా న కిం స్యాద్గతభావి చర్చా,
వినైకసఙ్ఖ్యాం గణనేవ లోకే? ॥

16. మనము లేక కాలమేది? దేశమేది? మనము దేహమనినచో కాలదేశములకు లోఁబడఁగలము. మనము దేహమా? మనము ఇప్పుడు, అప్పుడు, ఎప్పుడు నొకరము. ఇక్కడ, అక్కడ, ఎక్కడ నేకమే; కనుక కాలదేశములు లేని మనమే యున్నారము.

శ్లో॥ క్వ భాతి దిక్కాలకథా వినాఽస్మాన్?
దిక్కాలలీలేహవపుర్వయంచేత్,
నక్వాపి భామో? న కదాఽపి భామో?
వయంతు సర్వత్ర సదాచ భామః ॥

17. తన్నెఱుంగనివారికిఁ దన్నెఱింగినవారికిని దేహము నేనే. తన్నెఱుంగనివారికి దేహమంతయే (దేహమాత్రమే) నేను. దేహములోనఁ దన్నెఱింగినవారికి హద్దు

ద్వి॥ గతభావికాలముల్ స్థితవర్తమాన
గతము; లవి జరగుకాలమునం దనియు
వర్తమానము గాన వర్తమానంబె
వర్తిల్లు నేకమై; వర్తమానగతి
నెఱుఁగక గతభావు లెఱుఁగఁదలంచి
యెఱుఁగు మొకటిలేక యెంచోట యుంచు॥

వ॥ పరఁగును వర్తమానమునుబట్టియె భూతము భావికాలము ;
వరుసగ వానికాలముల వర్తిలు నయ్యది వర్తమానమే ;
వఱలును వర్తమానమె ధ్రువంబుగ ; "నిప్పుడు" వర్తిల్లుచున్న దే
యరయుట భూతభావిగతు లక్కట ! యొక్కటి లేక యుండునే॥

ద్వి॥ కనము మనల వీడి కాలదేశముల;
మనము దేహ మనిన మనము దాసులము
కాలదేశముల ; కీకాయము మనమె ?
లీలఁ జరించు ముక్కాలములందు
మన మిందు నందు నెందు నొకరమౌట,
మనమె దిక్కాలములను నిండి కలము॥

వ॥ మనలనువీడి యెక్కడిది మాయను కాలము దేశ; మాను మీ
తనువన, లోఁబడంగలము తప్పక వానికి; నేను మాను మా ?
అనయము కాలదేశముల కావల నిప్పుడు నప్పు డెప్పుడున్
మన మొకరమ్మె యుండునది మానక యిప్పుడు నప్పు డెప్పుడున్ ॥

ద్వి॥ తనువు నేనేయగుఁ దన్నుఁ దెలియని
మనుజుల కెఱిఁగిన మనుజులకైన ;
తనువు మాత్రమె యెఱుఁగనివారి "నేను" ;
తనువులోఁ దన్నెఱింగినవారి "నేను"

లేక నేను తానుగఁ దోఁచెను. ఇదియే వీరల భేద మని తెలియుము.

శ్లో॥ దేహాత్మభావే జ్ఞజడౌ సమానా;
వేకస్య దేహే హృది దీప్త ఆత్మా
ఆక్రమ్య దేహంచ జగచ్చపూర్ణం
పరస్యామేయం తనుమాత్రమాత్మా॥

18. తెలియని వారికిని తెలిసిన వారికిని జగత్తు సత్యమగును. జ్ఞానహీనులకు లోకము మాత్రమే సత్యము. జ్ఞానులకు సత్యము లోకమున కాధారమై అరూపమై నిండియుండును. ఇదియె వీరలకుఁ గల వ్యత్యాసము.

శ్లో॥ అజ్ఞస్య విజ్ఞస్యచ విశ్వమస్తి
పూర్వస్య దృశ్యం జగదేవ సత్యం;
పరస్య దృశ్యాశ్రయః భూతమేకం
సత్యం ప్రపూర్ణం ప్రవిభాత్యరూపం॥

19. విధి మతుల మూలవివేకము లేనివారికే విధి మతులు గెలుచే వివాదము కలదు. విధి మతులకు ఏక మూలమైన తనను ఎఱింగినవారు అవి తొలంగినవారు. వారు మరల వానిం జేరఁగలరా? చెప్పుము.

శ్లో॥ విధేః ప్రయత్నస్య చ కోఽపి వాద
స్తయోర్ద్వయోర్మూల మజానతాంస్యాత్;
విధేః ప్రయత్నస్య చ మూలవస్తు
సంజానతాం నైవ విధిర్నయత్నః॥

తనకెల్ల లేనిదై తానుగ వెలుఁగు ;
కనఁగ వీరలకును గల భేదమిదియు ॥

చ॥ తనుఁ గనుఁగొన్న వారికిని దక్కినవారికి "నేను" దేహమౌ
ననఁదగు; దేహమాత్రమగు నాత్మవివేకము లేని వారికిన్ ;
దనువునఁ దన్నెఱుంగఁగను దానుగఁ దోఁచును "నేను" [illegible] ;
కనయ మిదే విభేదమని యందురు పెద్దలు వారిలోపలన్ ॥

ద్వి॥ జ్ఞాని కజ్ఞానికి జగము సత్యమగు ;
జ్ఞాన రహితులకు జగ మంతయు యది ;
జ్ఞాని సత్య మరూపమై నిండి, జగతి
స్థానమై యుండు ; భేద మిరువురకిది ॥

ఉ॥ లోకము సత్యమౌఁ దెలివి లోపమువారికి, [illegible] ;
లోకము మాత్రమే నిజము లుప్తవివేకుల ; [illegible]
శ్లోకులకున్ నిజం బతి విశుద్ధము లోకము మూలమౌ [illegible]
పైకత నిండియుండు; నిదియే మును నీరికిఁ గల్గు [illegible] ॥

ద్వి॥ విధి మతి మూలమ్ము వెదకనివారె
విధి మతులు జయించు వికటవాదకులు ;
వీని కొకే మూలమైనది తన్నెఱుఁగు
జ్ఞానులు వీడిరి వానిఁ జేరరిఁక ॥

తే॥ గీ॥ విధి మతుల మూల మెఱుఁగని వెట్టులందె
విధి మతులు గెలుచే వివాదవిషయముండు ;
విధి మతుల కేకమూలమై వెలయు తనను
ఎఱుఁగ నవిపోవు ; నావల నెట్లు కలుగు ?॥

20. చూచెడు తన్నుఁ జూడక తాను దైవమును జూచుట కనఁబడు మానసికదర్శనమే. తన్నుఁ జూచువాఁడే దైవమును జూచువాఁడఁట! తన మూలమును దాను మూలము పోయి (నష్టమై) కనువాఁడు. దైవములేక తాను లేఁడు గదా!

శ్లో॥ యదీశితు ర్వీక్షణ మీక్షితార
మవీక్ష్య తన్మానసికేక్షణంస్యాత్,
నద్రష్టు రన్యః పరమో హితస్య
వీక్షాస్వమూలే ప్రవిలీయ నిష్ఠా॥

21. తనుఁ దాఁ జూచుట తాను దైవమును జూచుట అను నానా శాస్త్రముల తాత్పర్య మేమనిన, తననుఁ దాను జూచుట యెటులు? తా నొకఁ డగుటవలనఁ జూడ సాగ దనిన, దైవమును జూచుట యెటులు? తాను ఆహార మగుటయే.

శ్లో॥ ఆత్మాన మీక్షేత పరం ప్రపశ్యే
దిత్యాగమో క్తేః సులభోనభావః;
నాత్మైవ దృశ్యోయది కాకథేశే?
స్వయంతదన్నీభవనం తదీక్షా॥

22. దైవము బుద్ధికి వెలుఁగు నొసంగి, ఆ బుద్ధికి లోపల వెలుంగును. బుద్ధిని లోనఁ ద్రిప్పి దానియందుఁ జేర్చుటయే గాక దైవమును బుద్ధిచేత నెఱుంగు టెటులు? యోచింపుము. అనఁగా బుద్ధిని లోనఁజేర్చి చూడుము.

ద్వి॥ కను తన్నుఁ గనక తాఁ గనుట దైవమును
కనఁబడు మానసికమగు దర్శనమె;
తనుఁ జూచువాఁడె దేవుని జూచినాఁడు
తనదు మూలమును దానను మూలము చెడి
కనువాఁడె; యా దైవమునకు సత్యంబు
గను దాను లేకుంటయును తథ్యము గద॥

ఉ॥ చూచెడు తన్నుఁ జూడకయ చూచుట దైవముఁ దాను భ్రాంతిచేఁ
దోఁచెడునట్టి మానసిక దుర్బల దర్శన; మాత్మ [illegible]
చూచినవాఁడు దైవమును; కూడియు 'నేను' నను మూల [illegible]
జూచె స్వమూల; మాత్మ యెటు చొప్పడు దైవము లేకపోయినన్?॥

ద్వి॥ తనుఁ దాను గాంచుట తా శివుఁ గనుట
యను శాస్త్రముల భావ మది [illegible] యనిన,
తనుఁ దాను గనుటెట్లు తా నొక్కఁ డగుట?
తన దేవుఁ గనుటెట్లు? తా భోజ్యమగుటె॥

మ॥ తనుఁ దాఁ జూచుట తాను దైవమును సందర్శించుటం చాగమా
లను పల్మాటల యర్థమేమనినఁ, దన్నాలోకనం బెట్లు చే
యును దా? నొక్కఁడు గాన సాగదనుటే యుక్తంబనన్, దైవమున్
దనకంటెన్ గనుగొంట యెట్లొదవెడిన్? దానొగిరం బౌటయే॥

ద్వి॥ బుద్ధికి వెలుఁగిచ్చి బుద్ధిలో వెలుఁగు
సిద్ధమా దైవము, బుద్ధి లోఁ ద్రిప్పి
దేవునియందు బుద్ధిని జేర్పుము; మఱి
దేవు నెట్లెఱుఁగుట ధీచేఁ? దెలియుము.

శ్లో॥ ధియో ప్రకాశం పరమో వితీర్య
స్వయం ధియోఽన్తః ప్రవిభాతి గుప్తః
ధియం పరావర్త్య ధియో న్తరేఽత్ర
సంయోజనా న్నేశ్వర దృష్టి రన్యా॥

23. నే నని యీ దేహము పలుకదు. నిద్రయందుఁ గూడ నేను లేనని యెవ్వరును జెప్పుటలేదు. నే నొకటి పుట్టిన వెనుక నిఖిలమును బుట్టును. ఈ నేను ఎక్కడఁ బుట్టును అని సూక్ష్మ బుద్ధిచేత శోధింపుము.

శ్లో॥ నవక్తి దేహోఽహమితి ; ప్రసుప్తౌ
న కోఽపి నాభూవ మితి ప్రవక్తి ;
యత్రోదితే సర్వము దేతి ; తస్య
ధియాఽహమః శోధయ జన్మదేశం ॥

24. జడశరీరము "నేను" అనదు. సత్తైన చిత్తు జనించదు. నడుమ (మధ్య) దేహపరిమాణముగ "నే" నొకటి పుట్టును. ఇదియె చిజ్జడగ్రంథి, బంధము, జీవుఁడు, సూక్ష్మ శరీరము, అహంకారము, సంసారము, మనస్సు మొదలగు నవి యని తెలియుము.

శ్లో॥ దేహో నజానాతి ; సతో నజన్మ ;
దేహప్రమాణోఽన్య ఉదేతి మధ్యే ;
అహంకృతి గ్రన్థి విబన్ధ సూక్ష్మ
శరీర చేతో భవ జీవ నామా ॥

మ॥ తలఁపన్ దైవము బుద్ధికిచ్చి వెలుఁగున్, దా వెల్గెడిన్ బుద్ధిలో
పల; లోఁ ద్రిప్పియు బుద్ధి దైవమునఁ జేర్పన్ గాక, దైవమ్ము నె
ట్టు లెఱుంగన్ దగు; బుద్ధిచేత? నిది తొట్రుంబాటు లేక మదిన్
దలపోయన్ దగు; నన్నచో, మదిని లోనన్ జేర్చి చూడన్ దగున్॥

ద్వి॥ నే నని పలుక దీపీనుఁగ తనువు;
నేను లేను నిదురలో నన రెవరు;
నేనొండు పుట్ట జనించె నన్ని; యెట
నేను పుట్టు నని సున్నితమతి నెంచె॥

తే॥గీ॥ ఈ శరీరంబు 'నే' నని యెప్పు డనదు;
నిద్రయందేని యెవరును 'నేను లేను'
అనరు, 'నే' నొండు పుట్టిన నవలఁ బుట్టు
నిఖిల; మెచ్చటఁ బుట్టు నీ 'నే' నటంచు
సూక్ష్మబుద్ధిచేఁ జేయుము శోధనంబు.

ద్వి॥ అనదు "నే" నని జడమైన దేహంబు;
జనియింప దెప్పుడు సచ్చిత్తు; మధ్యఁ
దను పరిమాణముగను బుట్టు "నేను"
గ నొకటి చిజ్జడగ్రంథి బంధంబు;
మన సహంతయు సూక్ష్మతనువు జీవుండు
ఘనతరసంసారమును నగు నదియె॥

మ॥ జడమైనట్టి శరీర "మే" ననదు తాఁ; సత్తైన చిత్తెప్పుడున్
బొడమన్ జాలదు; మధ్య "నే" నొకటిరూపున్ బొందు దేహాకృతిన్
బొడమిన్ దా నిదె చిజ్జడంపు ముడియున్ బొల్పొందు బంధంబు జీ
వుఁడు సంసారము సూక్ష్మదేహము మనంబున్ దా నహంకారమున్॥

25. రూపమును బట్టుకొని పుట్టును, రూపమునుబట్టి నిలుచేను, రూపమునుబట్టి భుజించి వృద్ధిఁజెందును, రూపమును విడిచి రూపమును దాల్చును, వెదకఁగ వదలి పరుగెత్తును ఆ రూపములేని యహంకార పిశాచము.

శ్లో॥ రూపోద్భవో, రూపతతిప్రతిష్ఠో,
రూపాశనో, ధూతగృహీత రూపః,
స్వయం విరూపః, స్వవిచారకాలే
ధావత్యహంకార పిశాచ ఏషః॥

26. అహంకారము కలదనిన అఖిలమును గలదు; అది లేదనిన అఖిలమును లేదు. కనుక అహమే యఖిలము నగును. కావున ఇది యెది యని వెదకుటయే సకలమును వదలుట అని తెలియుము.

శ్లో॥ భావేఽహమః సర్వమిదం విభాతి;
లయేఽహమో నైవ విభాతి కించిత్;
తస్మాదహంరూప మిదం సమస్తం
తన్మార్గణం సర్వజయాయ మార్గః॥

27. "నేను" పుట్టకయున్న స్థితియే మనము అదిగనున్న స్థితి. "నేను"పుట్టుచోటును వెదకి చేరక "నేను"పుట్టని తన నాశము నందుట యెటులు? దానిని బొందక తానదియగు తన స్థితియందు నిలకడఁ జెందుట యెటులు? చెప్పుము.

ద్వి॥ రూపుఁబట్టి జనించె, రూపున నిలుచె,
రూపుఁబట్టి తిని పెరుఁగు, రూపు విడిచి
పట్టు రూపు, వెదకఁ బరుఁగిడి తొలఁగు
నట్టి యరూప మహం పిశాచంబు ॥

తే॥ గీ॥ రూపమునుబట్టి పుట్టును, రూపుఁబట్టి
నిలుచె, రూపునుబట్టి తిని యభివృద్ధిఁ
జెందు, నా రూపముఁ గ్రోసి చిత్రముగను
రూపుఁ దాల్చును, వెదకఁగా రూపులేని
యా యహం పిశాచం బది మాయమగును ॥

ద్వి॥ అహము కలదనిన నఖిలము గలదు ;
అహము లేదన్న లే దఖిలము ; గాన
అఖిల మహ ; మది యేదని వెదకుటయె
అఖిలమును వదలుటగునని యెఱుఁగు ॥

తే॥ గీ॥ అహము కలదన్నఁ గలద యీ యఖిల ; మహము
లేదనిన నిక్క మఖిలంబు లేద ; కాన
నహమె యఖిలంబు ; నిది యెది యనుచు వెదకి
చూచుటయె వీడు టఖిలమ్ము సు ; మ్మెఱుఁగుము ॥

ద్వి॥ నేను పుట్టని యా యునికియే మన మది
గా నున్నది యగును ; నే నుదయించె
స్థానమును వెదకి దాని నందకయె
నేను పుట్టని యహంతా నాశ మెటులు
పొందును ? దానిని బొందక యెటులు
అందును తా నది యగు స్వస్థితియును ? ॥

శ్లో॥ సత్యాస్థితి ర్నాహమితి యత్ర
తచ్ఛేదయస్థానగవేషణేన
వినా న నశ్యే; ద్యది తన్న నశ్యేత్,
స్వాత్మైక్యరూపా కథమస్తు నిష్ఠా? ॥

28. ఒక మనుజుఁడు నీటిలోఁ బడిన వస్తువును గొనుటకై నీట మునుఁగు తెఱఁగున, "నేను" బుట్టుచోటిని తీక్ష్ణమైన బుద్ధిచేత వాక్ప్రాణబంధనముతో లోన మునిఁగి యెఱుఁగ వలయును.

శ్లో॥ కూపే యథాగాధజలే తథాన్త
ర్నిమజ్య బుద్ధ్యాశితయా నితాన్తం,
ప్రాణంచ వాచం చ నియమ్య చిన్వ
న్విన్దే న్నిజాహంకృతి మూలరూపం ॥

29. "నేను" అని నోటితోఁ బలుకక లోన మునుఁగు మనస్సువలన "నేను" అని యెచ్చట వెలుఁగునని వెదకుటయే జ్ఞానవిచార మగునుగాని, "ఇది నేను గాదు, అది నేను అగుదును" అని తలంచుట సహాయమేగాక అదియే విచార మగునా?

శ్లో॥ మానేన మజ్జ న్మనసా స్వమూల
చర్చైవ సత్యాత్మవిచారణం స్యాత్;
"ఏషోఽహ మేత న్నమమ స్వరూపం"
ఇతి ప్రమా సత్యవిచారణాఙ్గం॥

ఉ॥ "ఏ" నిది పుట్టుచున్న స్థితియే మన మద్దిగ నున్న తత్పదం ;
"నే" నుదయించు చోటరయ, "నే" నభవంబగు చిత్తనాశమున్
దానెటు పొందుఁ? బొందకయె తా నదియై తన సత్పదమ్మునన్
దా నచలైకనిష్ఠతను దాల్చుట యెట్టులు కల్గుఁ? జెప్పుమా ॥

ద్వి॥ మనుజుఁడు జలవినిర్మగ్న వస్తువును
గొనుటకై మునుఁగు చొప్పునఁ, దీక్ష్ణబుద్ధిఁ
గొని, వాక్కుఁ బ్రాణము నణఁచి, లో మునిఁగి
కనవలయును "నేను" జనియించు చోటు ॥

ఆ॥ వె॥ నీటఁబడిన వస్తునిచయమ్ముఁ గనుఁగొన
మునుఁగునట్లు, లోన మునిఁగి, తీక్ష్ణ
బుద్ధిచేతఁ బ్రాణమును వాక్కు నరికట్టి,
"నేను" పుట్టుచోటు నెఱుఁగవలయు ॥

ద్వి॥ "ఏ"నని నోటితో నేమి నుడువక
లోన మునుఁగు మదిచే నెట వెలుఁగు
"నే"నని వెదకుటే జ్ఞానవిచార
మౌను, గాని, "యిది నేఁ గా," "నది నేను
అగుదు" ననుటయు సహాయమే గాక,
అగునె విచార మయ్యదియె న్యాయముగ ?॥

తే॥ గీ॥ ఉరక "నే"నని నోటితో నుచ్చరింప
కొనర లోన మునింగెడు మనసుచేత
"నే"ననున దెచ్చట వెలుంగునో నెమకుటె
జ్ఞానసువిచార ; "యిది నేను," "కాన దే" న
టనుట సాయంబగు ; విచార మదియె యగునె ?

30. "నే" నెవ్వఁడని మనస్సులోపల వెదకుచు
హృదయమునఁ జేరినపుడు నే ననువాఁడు తలక్రిందఁబడిపోయి,
తోడనే "నేను" "నేను" అనుచుఁ దానుఁగ నొక వస్తువు
తోఁచెను. తోఁచినను దాని యర్థము అహంకారముకాదు.
పరిపూర్ణ వస్తువే దానియొక్క యర్థము.

శ్లో॥ గవేషణాత్ప్రాప్య హృదంతరంతత్
పతేదహన్తా పరిభుగ్నశీర్షా;
అథాఽహ మన్యత్స్ఫురతి ప్రకృష్టం;
నాఽహంకృతి స్తత్పరమేవపూర్ణం ॥

31. తన్ను మ్రింగి యుప్పొంగిన తన్మయానందునికిఁ
జేయవలసిన పని యేమి కలదు? వాఁడు తనకన్న నన్యమేమి
యు నెఱుఁగనివాఁడు. వానిస్థితి యిది యని మనము తలం
చుట యెట్టులు?

శ్లో॥ అహంకృతిం యో లసతిగ్రసిత్వా
కిం తస్యకార్యం పరిశిష్ట మస్తి?
కించి ద్విజానాతి సనాత్మనోఽన్యత్;
తస్యస్థితిం భావయితుం క్షమః కః? ॥

32. "అది నీవు" అని వేదము లుద్ఘోషించుచుండఁ
దనను దా నెది యని తెలిసికొని నిలువక, "అది నేను"-
"ఇది కాదు" అని తలంచుట మనోబలము లేనందువలననే;
ఎప్పుడును అది తానుగనే వెలుఁగుచున్నదిగదా.

ద్వి॥ "నే" నెవఁడని మదిలోన వెదకుచో
అనహృదయము, నే ననువానిశిరము
తునుఁగ, "నే" "నే" నని తోఁచును దాను
గ నొకటి; యహ మిది కాదు, పూర్ణంబె॥

శా॥ ఏ నెవ్వండ నటంచు మానసములో నెంతేని శోధించుచున్
దా నే మూలముగా వెలుంగు హృదయాంతర్ధామమున్ జేరఁగా,
'నే' నంతన్ దలక్రిందుగాఁబడి యటన్ 'నేన్' 'నే' నటంచొక్కటై
తా నై తోఁచును; బూర్ణవస్తువదియౌఁ; దాఁ గా దహంకారమున్॥

ద్వి॥ తను మ్రింగి యుప్పొంగు తన్మయానంద
ముని చేయవలసిన పని యేమి గలదు?
ఎదియును దనకన్న నితరమరయఁడు;
ఇదియని యతనిస్థితిఁ దలఁపఁ గలమె?॥

ఆ॥ వె॥ తన్ను మ్రింగి పొంగు తన్మయానందుండు
చేయఁదగిన దేమి సేఁత కలదు?
అన్య మేమి యెఱుఁగఁ డవ్వాఁడు తనకన్న;
వానిస్థితి యి దనఁగవచ్చు నెట్లు॥

ద్వి॥ అది నీ వని నుడువ నన్ని వేదములు,
నెది తా ననుచుఁ దన్ను నెఱిఁగి నిలువక,
"నే నది" "కా దిది నే" నని తలఁచే
టాను మనమున దార్ఢ్యము లేమివలన ;
ఎల్ల వేళల నదియే తానుగాను
యుల్ల ముజ్జ్వలియించుచున్నదిగాదె॥

శ్లో॥ ఆహ స్ఫుటం "తత్త్వమసీ" తి వేద;
స్తథాప్యసంప్రాప్య పరాత్మనిష్ఠాం
భూయోవిచారో మతిదుర్బలత్వం;
తత్సర్వదా స్వాత్మతయాహి భాతి॥

33. "నన్ను నే నెఱుఁగను" "నన్ను నే నెఱుఁగుదును" అనుట హాస్యాస్పదముగ నున్నది. ఏల? తన్నుఁ దనకు విషయము గావింపఁ దాను రెం డగునా? తాను ఏకమగుట అందఱికిని అనుభవసిద్ధము.

శ్లో॥ నవేద్మ్యహం మా ముత వేద్మ్యహం మా
మితి ప్రవాదో మనుజస్య హాస్యః
దృగ్దృశ్యభేదా త్కిమయంద్విధాత్మా?
స్వాత్మైక్యతాయాం హి ధియాం నభేదాః॥

34. ఎప్పుడును ఎవ్వరికిని స్వభావమైయుండు వస్తువును స్వస్థానమగు హృదయమం దెఱింగి ఆస్థితియందు నిలుకడఁజెందక, ఉన్నది, లేదు, రూపము, అరూపము, ఏకము, ద్వయము, రెండును గాదు, అని జగడము వేయుటయే (వాదించుటయే) మాయాదోషము (జ్ఞానహీనత).

శ్లో॥ హృత్ప్రాప్య సద్ధామ నిజస్వరూపే
స్వభావసిద్ధేఽనుపలభ్య నిష్ఠాం,
మాయావిలాసః సదసత్సరూప
విరూపనానైకముఖప్రవాదాః॥

తే॥ గీ॥ "అదియె నీ" వని వేదంబు లఱచుచుండఁ,
దా నదై యెఱింగి నిల్వక, "నే న దౌదుఁ"
"గా నిది" యటంచుఁ దలంచుట మానసమున
బలములేమిఁ; దానుగ నిల్వ వెలుఁగదె యది ? ॥

ద్వి॥ "నను నే నెఱుఁగ," "నేను నన్ను నెఱుఁగుదు"
నను రెండు నున్నవి హాస్యాస్పదముగ;
తను విషయ మొనర్పఁ దాను రెం డగునె ?
తన యేకత యగు నందఱి యనుభూతి ॥

ఆ॥ వె॥ "నన్ను నే నెఱుఁగను" "నన్ను నే నెఱుఁగుదు"
ననుట హాస్యవిషయమగును ; దాను
తనవిషయమగుటకుఁ దాను రెండౌనె ? తా
నొక్కఁ డనుట యందఱొప్పినదియె ॥

ద్వి॥ ఏవారి కెపుడు స్వభావమైయున్న
యావస్తు వున్న దా వగు హృది నెఱిఁగి
చెదరని స్థిరత నాస్థితిని నిలువక,
'అదియున్న'-'దది లేని', 'దదిరూ'—'పరూప
మగు,' 'నొండు'-'రెండు' 'కాదది రెండు,' ననియుఁ
దగవు లాడుట యవిద్యాదోషమగును ॥

చ॥ ఎవనికి నేస్ స్వభావమయి యెప్పుడు నుండెడు సత్యవస్తువున్
దివుటను స్వస్థలంబయిన దివ్యహృదంతరమం దెఱింగి యా
ప్రవిమలసుస్థితిన్ గొనక, 'భావ'-'మభావ,' 'మనేక'-'మేకమౌ'
'గవయగుఁ'-'గా,' 'దరూపియగుఁ'-'గా',దని పోరుట మాయదోష
మే ॥

35. సిద్ధమైయుండు వస్తువును ఎఱిఁగియుండుటయే సిద్ధి. ఇతర సిద్ధులన్నియు స్వప్నసిద్ధ సిద్ధులే. నిద్రపోయి మేలుకొనిన వెనుక అవి సత్యమగునా? సత్యవస్తునిష్ఠులై మాయవీడినవారు వానియందు భ్రమనొందఁగలరా? తెలియుము.

శ్లో॥ సిద్ధస్య విత్తిః సతఏవసిద్ధిః;
స్వప్నోపమానాః ఖలు సిద్ధయోఽన్యాః;
స్వప్నః ప్రబుద్ధస్య కథంను సత్యః?
సతిస్థితః కింపునరేతి మాయాం? ॥

36. మనము శరీరము అను తలంపు కలిగిన యెడలనే మనము ఇది కాము, మనము అది (అనఁగా స్వరూపము) అని తలంచుట మన మదిగా నిలుచుటకు మంచి సహాయము: కాని యెప్పుడును మన మది యని యెంచుట యెందుకు? నేను మనుష్యుఁడ నని తలంచవలయునా? ఎప్పుడును మన మదిగానే యున్నాము గదా.

శ్లో॥ సోఽహం విచారో వపురాత్మభావే
సాహాయ్యకారీ పరమార్గణస్య;
స్వాత్మైక్యసిద్ధౌ స పునర్నిరర్థో;
యథానరత్వ ప్రమితిర్నరస్య ॥

37. సాధనయందు ద్వైతమే, సాధ్యమందే అద్వైతము అను వారల వాదమును వాస్తవముగాదు. ఆదరముతోఁ దాను పదియవవానిని వెదకు కాలమందును,

ద్వి॥ సిద్ధవస్తువుఁ దెలిసి యటుండు సిద్ధి;
సిద్ధులన్నియు స్వప్నసిద్ధసిద్ధులగు;
నిద్రవిడిచి మేల్కొనిన నవినిజమె?
భద్రముగా సత్యవస్తువునందు
నిలకడఁగని మాయ తొలఁగిన వారు
చలియింప రిఁక నాస్వప్నభ్రాంతికొఱకు ॥

చ॥ నిరతము సిద్ధవస్తువది నేననిదెల్సి యటుండు టేదియో
స్థిర మది సిద్ధి; యన్యములు సిద్ధులు స్వాప్నికసిద్ధసిద్ధులే;
అరిగియు నిద్ర మేల్కొనఁగ నయ్యవి నిల్చునె? సత్యనిష్ఠులై
పరఁగుచు మాయవీడ్కొనినవారల కందున భ్రాంతి యుండునే? ॥

ద్వి॥ తను విడె మన మను తలఁపు గలిగిన,
మన మా స్వరూపము, మన మిది కాము
అని తలంచుట మన మదిగ నిలువఁగ
మనకు సహాయమే; మన మది యనుచు
నెంచుటె యెప్పుడు నేల? యేను నరుఁడని
యెంచవలెనె? మన మెపు డది గామె? ॥

చ॥ మనము శరీరమన్ తలఁపు మానసమందునఁ గల్గినప్పుడే
మన మిది గా, మదాదు మను మానసవృత్తి ఘటిల్లు టయ్యెడిన్
మన మది గాఁగ నుండుటకు మంచిసహాయము; కాని నే నదం
చనవలెనే సదా? నరుఁడనన్ వలెనే? మనమెప్పుడేగదా ॥

ద్వి॥ సాధకమున రెండు సాధ్యమం దొకటి
బోధించు వాదము పొల్లై; దాఁ బ్రేమ

తనను దాను పొందిన కాలమందును తాను పదియవవాఁడే గాక మఱి యెవఁడు?

శ్లో॥ ద్వైతం విచారే పరమార్థబోధే
త్వద్వైతమిత్యేష న సాధువాదః
గవేషణాత్ప్రాగ్దశమే వినష్టే
పశ్చాచ్చలబ్ధే దశమత్వమేకం ॥

38. మనము కర్మకర్తల మనిన కర్మఫల భోక్తల మును కాఁగలము. కర్త యెవ్వఁ డని యడిగి తన్నెఱుఁగఁగా, కర్తృత్వముపోయి కర్మలు మూఁడును వీడును. ఇదియె నిత్యముక్తిపదము.

శ్లో॥ కరోమి కర్మేతి నరో విజానన్
బాధ్యోభవే త్కర్మఫలంచ భోక్తుం
విచారధూతా హృదికర్తృతా చేత్
కర్మత్రయం నశ్యతి, సైవముక్తిః ॥

39. "బద్ధుఁడు నేను" అనువఱకే బంధముక్తి చింతలుండును. బద్ధుఁడెవఁడని తన్నుఁ దాఁజూడఁగ, సిద్ధమై నిత్యముక్తుఁడైన తా నుండి బంధచింత యంతయొందుననిన ముక్తిచింత ముందుకు నిలువఁగలదా?

శ్లో॥ బద్ధత్వభావే సతి మోక్షచిన్తా;
బన్ధస్తు కస్యేతి విచారణేన

మున వెదకెడు వేళఁ, దనుఁగన్న వేళఁ,
దన దశమత్వము తనకు సిద్ధంబె ॥

ఉ॥ సాధనమందు ద్వైతమగు సాధ్యమునందగు నద్వితీయ, మా
వాదుల వాదమెన్నడు నవాస్తవ: మద్ది కుతర్కరీతి; యు
త్త్యాదరబుద్ధిఁ దా దశము నారయువేళను, దన్నుఁ దాను బల్
సోదనసేసి పొందునెడ సూక్ష్మముగా, దశ ముండు తానెగా ॥

ద్వి॥ మనము కర్తలమన మనము భోక్తలము;
కనుక కర్తయు నెవ్వఁ డని చూడఁ దన్ను,
వీడె కర్తృత్వము, వీడుఁ గర్మములు
మూఁడును; నిత్యవిముక్తిపద మిది ॥

తే-గీ॥ మనము కర్మకుఁ గర్తల మగుదు మనినఁ,
గర్మఫల భోక్తలమును గాఁగలము; కర్త
యెవ్వఁ డను ప్రశ్నచేతఁ దన్నెఱిఁగె నేని,
కర్తృత నశించె; మూఁడగు కర్మములును
వీడు; నిత్యముక్తిపదము విజ్ఞుల కిది ॥

ద్వి॥ బంధము నా కను పర్యంత ముండు
బంధముక్తులఁ గూర్చి పలుచింతలవియు;
బంధ మేరికని తాఁ బరికింపఁ దన్ను,
బంధమందని సదానందుఁడై యుండ
బందంపుఁ దలఁ పంతమందు నసంగ,
ముందుకు నిలుచునె ముక్తి తలంపు? ॥

ఉ॥ బద్ధుఁడు నేన యన్ జనుక బంధవిముక్తుల చింతయుండెడిన్;
బద్ధుఁ డెవం డటంచును స్వభావమునుం గొడగాంచె నేని, తా ।

సిద్ధేస్వయం స్వాత్మని నిత్యముక్తే,
క్వబన్ధచిన్తా, క్వచమోక్షచిన్తా ? ॥

40. రూపము, అరూపము, రూపారూపము అని మూఁడు విధములుగ ముక్తియుండును అనిసఁ జెప్పెదను. రూపమును, అరూపమును, రూపారూపమును గుఱించి తలంచుచున్న యహంకారరూపము నశించుటయే ముక్తి యని యెఱుంగుము.

శ్లో॥ రూపి ణ్యరూపి ణ్యుభయాత్మికాచ
ముక్తి స్త్రిరూపేతి విదో వదన్తి
ఇదం త్రయం యా వివిన క్త్యహంధీ
స్తస్యాః ప్రణాశః పరమార్థ ముక్తిః॥

# అనుబంధము

స్వవచనములను ఇతర భాషావచనములను జేర్చి శ్రీరమణులు అనుబంధముగ నొసంగిన యీ "సద్వస్తుసుధ"ను బఠించి భావము నెఱింగి యాచరించే సాధువులు శ్రేయస్సును బొందఁగలరు.

శ్లో॥ ఆప్తోక్తై రనువాదైశ్చ స్వవాక్యైశ్చ సుశోభితః
గ్రన్థః సూక్తిసుధాభిఖ్యో రమణేనానుబధ్యతే॥

# మంగళము

ఈ సర్వము దేనియందున్నదో, దేనిదో, దేనినుండి కలిగినదో, దేనికొఱకో, దేనివలననో, ఏదియో ఆ సద్వస్తువును భజింతము గాక!

శ్లో॥ యస్మిన్‌సర్వం, యస్యసర్వం,
యతస్సర్వం, యస్మాఇదం,
యేనసర్వం, యద్ధిసర్వం,
తత్సత్యం సముపాస్మహే.॥

# సూక్తి సుధ

ద్వి॥ ఆప్తోక్తులను దన యనువాదములను
దన సూక్తిసమితితోఁ దనరారఁ గూర్చి
సూక్తిసుధాభిఖ్య సుందరగ్రంథ
మనుబంధముగఁ జేర్చె నారమణర్షి.॥

తే।గీ॥ స్వోక్తు లాప్తోక్తులను గూర్చి సూక్తిసుధను
భాష రమణర్షి గీతాయనుబంధముగను,
వీనిఁ బఠియించి భావంబు విశదరీతి
నెఱుఁగు సాధులు శ్రేయమ్ముఁ బొరయువారు.॥

# మంగళము

ద్వి॥ దేనినుండి కలుగు, దేనియం దుండు,
దేని దీసర్వమ్ము, దేనికై వెలయు,
నే దేనివలననో, యేదియో, యదియె
సద్వస్తువగు దాని స్మరణసేసెదము.

మత్తకోకిల॥ దేనియం దిది లోకజాలము తేజరిల్లుచు నున్నదో
దేనిదో మఱి లోకమంతయు దేనినుండి జనించెనో,
దేనివల్లనొ సృష్టియంతయు, దేనికో, యది యేదియో,
దానిఁ గొల్తము సత్స్వరూపముఁ దథ్యవస్తువుఁ బూర్ణముఁ॥

1. సత్సంగమువలన బాహ్యసంగమును ఆంతరసంగమును దొలంగి, నిశ్చలతత్త్వము నెఱింగి జీవన్ముక్తులు కాఁగలరు. కావున సత్సంగముఁ జెందుము.

శ్లో॥ సత్సఙ్గత్వే నిస్సఙ్గత్వం, నిస్సఙ్గత్వే నిర్మోహత్వం,
నిర్మోహత్వే నిశ్చలతత్త్వం, నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః॥

2. సాధుసంగముచే హృదయమునఁ గలుగు స్పష్టమైన విచారముచేతఁ బొందఁబడు పరమపదము గురుశాస్త్రార్థపుణ్యములచేఁ బొందఁబడదు.

శ్లో॥ న తద్గురోర్న శాస్త్రార్థా న్న పుణ్యా త్ప్రాప్యతే పదం
యత్సాధుసఙ్గాభ్యుదితా ద్విచారవిశదాద్ధృదః॥

3. సాధుసంగము కలిగిన నియమము లన్నియు నక్కఱలేదు. మందానిలము వీవఁగ విసనకఱ్ఱవలనఁ బని యేమి కలదు ?

శ్లో॥ సజ్జనసఙ్గే సంప్రాప్తే సమస్తనియమై రలం ;
తాలవృన్తేన కిం కార్యం, లబ్ధే మలయమారుతే?॥

ద్వి॥ సత్సంగమున బాహ్యసంగ మాంతరము
సంగమువీడి నిశ్చలతత్త్వ మోటింగి
భవ్యజీవన్ముక్తిఁ బడయంగ నగును
కాన సత్సంగముఁ గాంచుమీ, మోహనయ.॥

ఆ॥వె॥ సాధుసంగమునను సకలసంగములును
తొలఁగి, నిశ్చలంబు తోఁచుఁ దత్త్వ;
మంతటను లభించు నల్ల జీవన్ముక్తి;
కాన సాధుసంగ మూను, మయ్య.॥

ద్వి॥ సాధుసంగముచేత స్వాంతాన నొదవు
స్పష్టవిచార మీపరమపదమ్ము
సమకూర్చునే, గురుశాస్త్రార్థపుణ్య
చయముచే నయ్యది సమకూడ, దయ్య.॥

తే॥గీ॥ సాధుసంగతిఁ హృదయాన సంభవమగు
స్పష్టమౌ విచారంబుచేఁ బడయఁగలుగు
నా పరమపదము గురుశాస్త్రార్థపుణ్య
సంచయమ్ములచేఁగూడ సాధ్యపడదు.॥

ద్వి॥ కలుగునే సాధుసంగమ్మింక మనకు
నఖిలనియమములు నక్కఱలేదు;
అవనిపై మలయమందానిలుం బొలయ,
నెవనికి నేఁ దాలవృంతం బదేల?॥

ఆ॥వె॥ సాధుసంగమంబు సంభవించెనయేని,
వలవ దఖిలనియమవర్తనంబు;
మలయమారుతంబు మలయుచో నుండంగఁ,
గార్యమేమి విసనకఱ్ఱవలన?॥

4. తాపము చంద్రునివలనను, దైన్యము కల్ప వృక్షముచేతను, పాపము గంగవలనను బోవును. సజ్జనసేవ చేత ఈమూఁడును వీడిపోవును.

శ్లో॥ గంగా పాపం, శశీ తాపం, దైన్యం కల్పతరు స్తథా,
పాపం తాపంచ దైన్యంచ, హన్తి సజ్జనదర్శనం.॥

5. జలమయతీర్థములును మృన్మయశిలామయ (మంటి రాతి) దేవతలును కాలాంతరమునఁ బావనము గావింపఁ గలవు. సాధువులన్ననో దర్శనమాత్రమునఁ బునీతులఁ జేయుదురు.

శ్లో॥ నహ్యమ్మయాని తీర్థాని, నదేవామృచ్ఛిలామయాః
తే పునన్త్యురుకాలేన, దర్శనాదేవ సాధవః ॥

6. దేవుఁ డెవ్వఁడు? మనస్సును ఎఱుఁగువాఁడు. నామనస్సు నావలననే కనఁబడుచున్నది. కనుక నీవే దేవుఁడవు. "ఏకో దేవః" అను శ్రుతి దీనికిఁ బ్రమాణము.

శ్లో॥ కో దేవో ? యో మనో వేత్తి ; మనో మేదృశ్యతేమయా,
తస్మాత్త్వమేవ దేవోఽసి ; "ఏకో దేవ" ఇతి శ్రుతేః ॥

ద్వి॥ పాపము నణఁగించు సురనదిచేత ;
దైన్యము కల్పకతరువుచేఁ దొలఁగు ;
నళినాంకుఁడు తాపము [illegible] దేవికడుఁ ,
సజ్జనసేవచే సమయుఁను నీ మూఁడు.॥

కం॥ పాపమును గంగయును, సం
తాపము నిందుఁడును, దీనతను కల్పకముం
బాపును ; సాధుల దర్శన
మాత్రమె మూఁడింటి నొకట బాపఁగలుగుఁన్.॥

ద్వి॥ ఇలఁ దీర్థమ్ములన్ మృచ్ఛిలామయ దేవతాళి
కాలాంతరంబునఁ గావించు శుద్ధి;
సాధువులన్న దర్శనమాత్రమె మనలఁ
బావనుల నొనర్చువార, లోనత్స ॥

ఆ॥వె॥ జలమయములు తీర్థములు మృచ్ఛిలామయ
దేవతలును చేయుఁ బావనంబు
కాలమరుగఁ ; గాని కనఁగానె చేతురు
పావనంబు సాధువర్యు లవని ॥

ద్వి॥ ఎవఁడు దేవుఁడు ? మన స్సెఱుఁగునవాఁడు ;
నామనస్సగపడు నావల్లఁ ; గాన
దేవుఁ డటంచేన నీవె కా ; దీని
శ్రుతియు "ఏకో దేవ" సూక్తిచే నుడువు ॥

తే॥గీ॥ దేవుఁ డెవ్వఁడు ? మనమును దెలియువాఁడు ;
నామనమ్మును గనఁగు నావలననె ;
కనుక నీవె దేవుండ ; "వొక్కఁడు దేవుఁ"
డనెడుశ్రుతి దీనికిఁ బ్రమాణ మగునుగాదె ॥

7. నీకు వెలుఁగు ఏది? నాకు పగటియందు సూర్యుఁడును రాత్రియందు చంద్రదీపాదికములును వెలుఁగై యున్నవి. ఆవెలుఁగును వెలిఁగించే వెలుఁగేది? కన్ను. కంటినేది వెలిఁగించేను? బుద్ధి. బుద్ధిని వెలిఁగించేనది ఏది? నేను. కనుక నీవే మేలైన వెలుఁగు. అది 'నేనే.'

శ్లో॥ కింజ్యోతి స్తవ? భానుమానహని మే, రాత్రౌ ప్రదీపాదికం
స్యా; దేవం రవిదీపదర్శన విధౌ కింజ్యోతి రాఖ్యాహి మే?
చక్షుః స్తస్యనిమీలనాదిసమయే కిం? ధీః; ధియోదర్శనే
కిం?తత్రాహ;మతో భవాన్పరమకంజ్యోతి; స్తదస్మి ప్రభో॥

8. హృదయగుహామధ్యమందు ఏకమైన బ్రహ్మము మాత్రమే "నేను నేను" అని యాత్మరూపమున భాసిల్లుచున్నది. తనను దా వెదకి మునుఁగు మనస్సుచేతనో, ప్రాణరోధమువలన మునుఁగు మనస్సుచేతనో, హృదయమునందు ఆత్మనిష్ఠుఁడవుగమ్ము.

శ్లో॥ హృదయకుహరమధ్యే కేవలం బ్రహ్మమాత్రం
హ్యహమహమితి సాక్షాదాత్మరూపేణభాతి;
హృది విశమనసా స్వం చిన్వతా మజ్జతా వా
పవనచలనరోధా దాత్మనిష్ఠో భవ త్వం॥

9. హృదయకమలమున నిర్మలమై నిశ్చలమై "నేను" అను నే జ్ఞానముకలదో, అహంకారమును బోఁగొట్టుటచేత అదియే ముక్తి నొసఁగును.

ద్వి॥ వెలుఁగేది? పగలింట వెలుఁగు భాస్కరుఁడు;
రజని నిందుఁడు దీపరాజియు వెలుఁగు;
ఆ వెల్గు వెల్గో? యక్షి, యక్షికినో?
బుద్ధి వెలుంగగు; బుద్ధికి వెలుఁగో?
నే; నిట్లు వివరింప నీవేగదయ్య
మూర్తైన వెలుఁ; గని యూలించు "నేను."

చ॥ వెలుఁగొను నేది? భానుఁడు వెల్గు పగల్, నిశిఁ జంద్రదీపముల్;
వెలుఁగుము వెల్గుఁ జేయఁగల వెల్గది? కన్నగు; దానికేదియో
వెలుఁ? గని బుద్ధి; దానికి వెల్గది? నేను; వెలుంగ నద్ది నీ
వలసను, నీవె మేలగు భాసమానగురుఁ; డద్ది 'నేనె'గా ॥

ద్వి॥ హృద్గుహామధ్యమం దేకమై బ్రహ్మ
"యహమహ" మని వెల్గు నాత్మరూపమున;
తనుఁ దాను వెదకఁగా మునుఁగు మానసము;
ప్రాణరోధమునను నట్టులే మునుఁగు;
రెంటిలో నొకదారి హృదయమునంది
యాత్మనిష్ఠుఁడ వగుమయ్య, నిశ్చలత. ॥

మాలిని॥ హృదిగుహానడుమన్ దా నేకమౌ బ్రహ్మమాత్రం
బగుచు యహమహమ్మం చాత్మగాఁ దానె వెల్గున్;
హృదిఁ జొరు మదిచేఁ దన్నెంచి లో మున్గియో, లే
కదిమి మునుఁగు శ్వాసన్ స్వాత్మనిష్ఠుండు గమ్మా ॥

ద్వి॥ నిశ్చలంబయి నిత్యనిర్మలంబగుచు
హృదయకమలమందు నే "యహం" జ్ఞాన
మమరు నహంకృతి హతమార్చుకతన
అజ్ఞాన మొసఁగెడు నదియ మోక్షమ్ము ॥

శ్లో॥ హృత్సరోజే హ్యాహం రూపా
యాచితిర్నిర్మలాఽచలా
అహంకారపరిత్యాగా
త్సాచితిర్మోక్షదాయినీ ॥

10. దేహము ఘటమువలె జడము. దీనికి నే నను తలంపు లేనందునను దేహములేని అనఁగా దేహమును గూర్చిన యెఱుకలేని నిద్రయందుఁగూడ దినము మన ముండుటచేతను దేహము నేను గాడు. 'నేను' ఎవ్వఁడు? ఎక్కడ నున్నవాఁడు? అని సూక్ష్మబుద్ధిచేత వెదకి|చూచి, తనయందు నిలుకడఁజెందినవారల హృదయాంతరంగమందు పరిపూర్ణుఁడైన యరుణాచలశివుఁడు "అహం"స్ఫురణ రూపుఁడై స్వయముగ ప్రకాశించుచున్నాఁడు.

శ్లో॥ దేహం మృన్మయవజ్జడాత్మక,
మహంబుద్ధిర్నతస్యా, స్త్యతో
నాహంత, త్తదపేతసుప్తిసమయే
సిద్ధాత్మ సద్భావతః
కోఽహంభావయుతఃకుతో వరధియా
దృష్ట్వాత్మనిష్ఠాత్మనాం
సోఽహంస్ఫూర్తితయాఽరుణాచలశివః
పూర్ణోవిభాతిస్స్వయం ॥

11. తానుపుట్టుచోటెదియని యెంచి తనమూలమా

క॥ అమలమ్మచల మహం రూ
పమునై హృదయకమలమున భాసిలు నే జ్ఞా
న మహాంతక విడువఁగ నా
యమలాహంజ్ఞాన మిచ్చి నరయఁగ ముక్తిన్

ద్వి॥ కన నీ శరీరము ఘటరీతి జడము;
'నే' ననుతలంపు దానికి లేదు;
తను వెఱుంగని నిద్ర మనయున్కి నిజము;
కాన నీ దేహము నేను గా, దయ్య;
ఎచ్చోటివాఁడ నే నెవఁడనం చెరసి,
యతిసూక్ష్మబుద్ధిచే నాత్మస్థుఁడైన,
వారిఁ దద్ధృదయాంతరంగంబునందు
నరుణాద్రిశివుఁ "డహంస్ఫురణ" రూపమునఁ
బరిపూర్ణుఁడై స్వయంప్రభత రాజిల్లు॥

శా॥ దేహంబో ఘటరీతిగా జడ, మహం
ధీ దీనలేకుండుటన్
నాహం బయ్యది లేని నిద్ర మన మే
నా యుండ సిద్ధాత్మగా;
కోఽహం బెవ్వండని సూక్ష్మబుద్ధిఁ దనుఁ ద
న్నాత్మోపనిష్ఠాత్ములన్
సోఽహంస్ఫూర్తి వెలుంగుఁ బూర్ణముగఁ దా
శోణాద్రిరూపేశుఁడే॥

ద్వి॥ తనపుట్టు చోటేది? యని యెంచి యాత్మ
మూలమౌ నాబ్రహ్మమునఁ బుట్టి నతఁడె

బ్రహ్మమందుఁ బుట్టువాఁడే పుట్టినాఁడు; దినము పుట్టువాఁడు. ఎల్లప్పుడు నవీనుఁ డా మునీంద్రుఁడు.

శ్లో॥ లేభేజనింయఃశివరమే స్వమూాలే
విచార్యకస్మాదహ మిత్యుదారః
సఏవజాతః, సచనిత్యజాతో,
నవోనవోఽయం సతతం మునీన్ద్రః ॥

12. నింద్యమైన దేహమే నేను అనుభావమును బాఁపుము. సంతతానందమైన నిన్ను నీ వెఱుంగుము. దేహ పోషణబుద్ధితోఁ దన్నెఱుంగఁ దలంచువాఁడు మొసలిని కలప (దూలము)గాఁ బట్టుకొని నదిని దాఁటఁబోవు వాఁడగును.

శ్లో॥ అసన్నిన్దస్య మిదం దేహ మహంభావం పరిత్యజ;
అవేహి త్వం సదాత్మాన మఖణ్డానన్ద మవ్యయం;
శరీరపోషణార్థీసన్, య ఆత్మానం దిదృక్షతి,
గ్రాహం దారుధియాధృత్వా, నదీంతర్తుం స గచ్ఛతి.॥

13. దేహాత్మభావమును వదలుటయె దానము, తపము, యజ్ఞము, ధర్మము, ధనము, యోగము, భక్తియు, వ్యోమము, శాంతియు, సత్యము, శక్తియు, మానము, నిష్ఠయు, చావని చావు, జ్ఞానము, సన్న్యాసము, మోక్షము, ఆనందమని యెఱుఁగుము.

శ్లో॥ యోదేహాత్మమతిక్షయోభవతి త
ద్దానంచ, యజ్ఞ, స్తపః,

పుట్టినవాఁడగు, నట్టేఁడు దినముఁ
బుట్టు, నవీనుఁ డా మునిరాజె సతము. ॥

తే॥గీ॥ ఎచటఁ దాఁ బుట్టునో యని యెంచి, తనదు
మూలమౌ బ్రహ్మమునఁ దాను బుట్టు వాఁడె
పుట్టినాతఁడు, దినమును బుట్టు వాఁడు;
ఆ మునీంద్రుఁడు నూతనుం డరయ నెపుడు. ॥

ద్వి॥ నింద్యమౌ దేహమ్ము నే నను తలఁపుఁ
ద్యజియింపు; మెఱుఁగు నిత్యానందు నిన్ను;
తనుపోషకంబగు తలఁపుతోఁ దన్ను
నెఱుఁగఁ జూచు పురుషుఁ డేఱు దాఁటుటకు
మొసలిఁ దెప్పగఁ గోరు బుద్ధిమంతుండు. ॥

మత్తకోకిల॥ ఇన్నికృష్టశరీర మేనని యెంచు భావము మాపుమా,
నిన్ను నిత్యసుఖస్వరూపము నే నటంచు నెఱుంగుమా;
తన్నుఁ గాంచుట కెన్నెఱుంగఁగ దేహపోషణబుద్ధితో,
ఎన్న నక్రముఁ దెప్పగాఁగొని యేఱు దాఁటఁ గడంగుటే. ॥

ద్వి॥ దేహాత్మభావమ్ముఁ దిరముగా విడుచె
దానతపోయజ్ఞ ధర్మసంపదలు,
యోగము, భక్తియు, వ్యోమము, శాంతి,
శక్తియు, మానము, సత్యము, నిష్ఠ,
సేవని సేవును, జ్ఞాన సన్న్యాస
ములు, మోక్షమానందమును, వత్స! యరయ. ॥

ఉ॥ దానము, యోగముల్, దపము,
ధర్మము, యజ్ఞము, శక్తి, సౌఖ్యముల్,

చి,దోవ్యా మాపిచ, సత్యవా, గుత కృపా,
థ ర్మార కామా అపి,
సన్న్యాసశ్చ,మృతిర్వినాఽపి మరణం,
జ్ఞానంచ, మోక్షోఽన్యసో
మానం, శా న్తిరపి, స్థితిశ్చపరమా,
యోగశ్చ, భ క్తిః వరా. ॥

14. కర్మవిభ క్తివియోగాజ్ఞానము లెవరికి? అని విచారించుటయే కర్మము, భ క్తి, యోగము, జ్ఞానము; అట్లు విచారింపఁగా మూలపురుషుఁడు పోవును; ఆ యుని మిదియుఁ బోవును; ఈ తొమ్మిదియు నెప్పుడునులేని తానుగా నిలుచేటయే సత్యము.

శ్లో॥ కస్యాస్తీతి కృతిర్విభ క్తిరపిచా
జ్ఞానం వియోగశ్చయ
త్తచ్ఛిన్నైవ కృతిశ్చ భ క్తిరపిచ
జ్ఞానంచ యోగోఽపిచ
యస్యాంస్యాన్న విచారకోఽహమభిధో
నస్యాత్స్వమ స్తంచతత్,
సాసత్యాస్థితి రిత్యవేహి విమలా
స్వాత్మానుభూతిశ్శివా. ॥

15. శ క్తిచేఁ దాము చలించుటెఱుఁగక సర్వసిద్ధులను దాము చెందుటకై చేష్టించుట మత్తుల నటనము, నన్ను

లేపిన ఈ శత్రువు లేమాత్రమని నుడువుచుంటివాని కథకు సమానము.

శ్లో॥ స్వంసర్వేశ్వరశక్తిచాలిత మని
జ్ఞాయోద్యతోయోఽఖిలాం
సిద్ధిం సాధయితుం సఏవమనుజో
యద్వత్ సపఙ్గుర్నరగి
యోఽవాదీ ద్భవితాత్రశమోవమకియా
నేతాన్ విజేతుం రిపూన్
మా ముత్థాప్య నివేశయేర్యది రణే
తేషాం పురస్తాదితి.॥

16. చిత్తశాంతియే సిద్ధమైయున్న ముక్తి; చిత్త వ్యాపారములేక సిద్ధులు లేవు. వానిపై బుద్ధిని బోవిడుచు వారు చిత్తచాంచల్యమణఁగిన మోక్షసుఖము నెట్లు పొందఁగలరు ?

శ్లో॥ చిత్తోపశమోముక్తిః
సత్యేవంచిత్తచేష్టయాప్యాను
సిద్ధిషు చిత్తం యేషాం
కథంను తేషాం భవేత్సుఖంముక్తేః॥

17. భగవంతుఁడు భూభారమును వహింప దాని నాభాసజీవుఁడు వహించుటెట గోపురవాహిబింబముఁబోలు పరిహాస్యమే యగును. బహుభారవాహి యగు బండిలోఁ బోవు

లేపిన నీ యరుదు లే పాటి" యనెడు
కుంటి వాని కథకు జోంటయే యగును. ॥

ఆ॥వె॥ శక్తిచేతఁ దాము చలియించవే యుండుఁగళ
సర్వసిద్ధు లొందఁ జేతనపడెడు
మత్తు నటన "మెత్తుమా నన్ను, శత్రు లే
పాటి" యన్న కుంటివాని కీడె. ॥

ద్వి॥ చిత్తశాంతి యగును సిద్ధమౌ ముక్తి;
చిత్తము వ్యాపృతిఁ జెందక లేవు
సిద్ధులు; వానిపై బుద్ధిగలట్టి
జనులు నా, చిత్తచాంచల్య మణంగు
మోక్షసుఖము నెట్లు పొందుదు, రయ్య?

ఆ॥వె॥ చిత్తశాంతియె గద సిద్ధమౌ మోక్షమ్ము;
చిత్తచేష్ట లేక సిద్ధు లున్నె?
వానిఁ గోరువారు మానసచాంచల్య
మణఁగు మోక్షసుఖము నందఁగలరె?॥

ద్వి॥ ఈశుఁడు భూభార మెల్ల వహింప,
నాభాసజీవి మోయఁగఁ బూనికఁ బోలుఁ
బరిహాస్య గోపుర వాహిబింబమును;
బహుభారముల మోయు బండిలోఁ జేనుచే

వాఁడు తన భారమును ఆ బండినుంచేక తలమీఁదఁ బెట్టు
కొని కష్టపడుట యెవరిదోషము ?

శ్లో॥ భూభారంవహతీశ్వరేసతి, వహాన్నాభాసజీవస్స్వయం
భారంగోపురధారిబింబసదృశోహాసాయకింనోభవేత్?
యానేనాతిభరక్షమేణమనుజోగచ్ఛన్, స్వశీర్షేభరం
ధృత్వాఖేదముపైతిచేద్బహుతరం,కస్యైషదోషోవద॥

18. రెండు స్తనములకు నడుమ రొమ్మునకు అడుగున
నుండు కడుపునకుపైన పలురంగులుగల పదార్థము లా
ఉన్నవి. వానిలో నొకటి కలువమొగ్గవలె కుడిభాగమున
రెండు[వేళ్ల దూరమున హృదయమున్నది.

శ్లో॥ ఉపరిజఠరదేశస్యాపి వక్షోన్తరేచ
వపుషి వివిధవర్ణం షట్కమస్త్యబ్జకానాం
కువలయకలికాభం దక్షిణాంశే నివిష్టం
భవతి హృదయ మన్తర్మధ్యతో ద్వ్యఙ్గులాన్తే॥

19. ముఖరుద్ధమైన దానిలోనుండు నల్ప (లేక
సూక్ష్మ) రంధ్రమందు రాగాదివాసనలు నిండిన మహాంధ
కారము గలదు. అన్ని నాడులు ఆ హృదయమును బట్టుకొని
యున్నవి. అదియే ప్రాణమన స్తేజస్సులకు స్థానమగును.

శ్లో॥ భవతివదనమస్యత్వావృతం తత్రమధ్యే
వియతి నిబిడమాస్తేఽజ్ఞానరూపంతమిస్రం
ఇహహిసకలనాడీసన్థయోవాసనాశ్చ,
భవతిసదనమేతత్ప్రాణచేతోద్యుతీనాం॥

నందు భారమ్ముంచే కది తలమీఁద
నిడికొని తపియించే డెవరితప్పగును ?

మ॥ భగవంతుండు వహించుచుండు నవనీభారమ్ముఁ, దాఁ దాల్చిన ట్లుగ నాభాసుఁడు జీవుఁడన్కొనుటయెట్లుల్ హాస్యమే, గోపురం బుగడుల్ బూనివహించు బింబమువలెన్ మూటల్ సమస్తమ్ము మో యఁగ నా బండిని మూటనెత్తినిడనే నాదోసమెవ్వారిదో?॥

ద్వి॥ చేనుగవ నడుమ వక్షమునకుఁ గ్రింద
నుదరంబునకు మీఁద నున్నవి యాఱు
పలురంగుల పదార్థములు; వానిలోన
నొక్కటి తాఁ గుడిప్రక్కఁ జెల్వారుఁ
గలువమొగ్గనుబోలి; కల దది రెండు
వ్రేళ్ల దూరంబున; హృదయము పేరు.

తే-గీ॥ చేనుగవ నడుమ రొమ్ము క్రిందెసయుఁ గడుపు
నగ్రమునఁ బలురంగు సామగ్రు లాఱు,
అం దొకటి కల్వమొగ్గ కీడై కుడితటి
నొనరు రెండు వ్రేళులదూరమున హృదయము॥

ద్వి॥ అది ముఖరుద్ధమౌ; నందులో నున్న
యల్పరంధ్రమున రాగాది వాసనల
గాఢంపుఁజీకఁటి కలదావరించి;
యఖిలనాడులు హృది నాశ్రయమొందుఁ;
బ్రాణతేజోమనస్థ్సాన మయ్యదియె ॥

తే-గీ॥ అది విరుద్ధముఖము; దాని యల్పరంధ్ర
మందు రాగాది వాసనాసాంద్రతమము
పరఁగు; నెల్లనాడులు హృదిఁ బట్టియుండు;
హృదియె ప్రాణతేజోమనస్సదన మగును.॥

20. హృత్పద్మగుహాయందు "నేను"గ వెలుఁగు దైవమే గుహేశుఁ డనఁబడువాఁడు. "ఆ గుహేశుఁడే నే" నను "సోఽహం" భావన 'దేహోఽహం' భావనవలె అభ్యాసబలముచేత దృఢపడి, ఆ వస్తువుగ వెలుఁగఁగ నశ్వర దేహము 'నే' నను కొన్న మిథ్యామాయాంధకారము సూర్యుని యెదుటఁ జీఁకటివలె నాశమగును.

శ్లో॥ వసతి హృదిగుహేశో
నామ యః "సోఽహమ"స్మీ
త్యవిరల మనువృత్త్యా
హం సఏవేతిభావః
యది భవతి దృఢాహం
ధీర్యథాఽస్మిన్ శరీరే
రవిమహాసితమోవ
చ్ఛిర్యతేఽసావవిద్యా॥

21. ఈ సర్వము నే పెద్దయద్దమందు ప్రతిబింబించునో జీవులయొక్క యా హృదయ మెది యని యడుగు రామునకు వసిష్ఠుఁ డి ట్లనియె. రామా, లోకజీవుల హృదయము హేయము ఉపాదేయ మని రెండువిధములు. వాని భేదమును వినుము.

ద్వి॥ హృత్పద్మగుహయందు "నేను"గ వెలుఁగు
నే నైవ మతఁడె గుహేశుఁ డనంగ;
"సోఽహ"మ్మను భావన యభ్యాసకలన
"వస్తువె నే" నన్న యీ భావనరీతి
నతిదృఢం బయి వెల్గ నావస్తువగుచే
ఖరకరు నెదుటఁ జీఁకట్లను బోలి
"ఏను నశ్వర దేహమే" యన్న మిథ్య
మాయాంధకారంబు మాయును, వత్స!॥

సీ॥ హృత్పద్మగుహను గుహేశుఁ డనంబడు
వాఁడె యహంశబ్దవాచ్యుఁ డౌచు
వెలుఁగు చునుండును; విధగ నా "నేనె"సో
"సోఽహ"మ్మనుటకు లక్ష్యార్థమగును;
దేహమే నే నను దృఢత బుద్ధికి నెల్లు
సహజమౌ యభ్యాససరణి నట్టి
సహజత "నే"నను సత్యవస్తువుపయి
దృఢపడి నీవె యా దివ్యవస్తు

గీ॥ నై వెలుంగఁగ, నశ్వరంబైన దేహ
మగుదు నే నను కల్లమాయాంధకార
ముగ్రకరుని గనుగుట నాశ మొందునట్టి
చీఁకటినిబోలి సమయు విచిత్రముగను॥

ద్వి॥ "ఏ పెద్దయద్దమం దీ సర్వజగము
ప్రతిబింబితమ్మగు, వర్ణనంబొందు
భూతహృదయమంచో, ముని, దానిఁ జెపుమ"
యనిన రాముని కిటు లను వసిష్ఠుండు:
జగతి భూతంబుల కగు ద్వివిధంబు
హృదయ ముపాదేయహేయంబు లనఁగ;

22. ఇంతయని పరిమితిగల యీ దేహమందు రొమ్ము లోన నొకచోటనుండు హృదయము హేయము (విడువదగినది) అని, చిన్మాత్రముగనుండు హృదయము ఉపాదేయము (కొనదగినది) అని యెఱుఁగుము. అది లోపల వెలియందుండును, లో వెలి లేకుండును.

23. అదే ముఖ్యహృదయము. దానియందే యీ జగత్తుండును. అన్నివస్తువుల కద్ద మదియే. ఐశ్వర్యముల కన్నిటికి ఆస్పద మది. కాన, జ్ఞానమే అఖిలజీవుల హృదయము అని చెప్పఁబడును. అది శిలవలె జడమైన దేహాంగమున నొక భాగముకాదు.

24. అందుచే ఆ పరిశుద్ధ జ్ఞానమయహృదయమున మనస్సును ప్రయత్నించి యుంచేఁగ వాయునిరోధనముతో వాసనాక్షయమును సిద్ధించెను.

రామః-

శ్లో॥ బ్రహ్మాణ్ జగతి భూతానాం
హృదయం తత్కిముచ్యతే
ఇదం సర్వం మహాదర్శే
యస్మిన్ స్తత్ప్రతిబింబతి ? ॥

పరిమితమగు దేహభాగంబునందు
వక్షంబునందున వఱలు హేయంబు;
వెలిని లో నుండి సంవిన్మాత్రముగను
వెలిలేక లోలేక వెల్గు హృదయము;
అది యుపాదేయ మ్మఁటంచు నెఱుంగు
అది ప్రధానంబగు; నందుండు జగతి;
అది పదార్థంబుల కగు సద్మముగను
ఎల్లసంపదలకు నిల్లగు నదియె;
అఖిలజంతువులకు నంత్రసు సంవిత్తె
హృదయం బటంచు; దేహైకావయవము
నం దొకయంగమై యస్థిరజీర్ణ
జడశిలోపమ మగు సాఁగునా యదియు ?
సంవిన్మయంబును సంశుద్ధమైన
హృదయమునన్ సారరీతిఁ జిత్తమ్ము
నుంప స్థిరమ్ముగా, నూడు వాసనలు
ప్రాణసంస్పందముల్, రామ! యణంగు॥

సీ॥ "ఏపద్ధఁబద్ధనుం దీ జగత్తంతయు
సెలఁగొని వెలుఁగునో నీడగాను
ఈ లోకవాసుల నెల్లజీవులకు, నా
హృదయము ననఁబడుచున్నదియు నేది ?
చెప్పు" మనియడుగు శ్రీరామునకు ముని
శ్రీవసిష్ఠుం డిట్లు చెప్పె: 'రామ,
ఈ దృశ్యవిశ్వమం దెల్ల జంతువులకు
హృదయము ద్వివిధమ్మనుదురు బుధులు
విను, కొనఁదగినది విడఁదగినది యని
యుండు నాహృదయ; మాయుభయమందు

వసిష్ఠః-

సాధో, జగతి భూతానాం హృదయం ద్వివిధంస్మృతం,
ఉపాదేయంచ హేయంచ విభాగోఽయం, తయోశ్శృణు;
ఇయత్తయాపరిచ్ఛిన్నే దేహేయద్వక్షసోఽన్తరం
హేయం తద్ధృదయంవిద్ధి తనావేకత శేస్థితం;
సంవిన్మాత్రంతుహృదయ ముపాదేయంస్థితం స్మృతం
తదన్తరేచ బాహ్యేచ, నచబాహ్యే నచాన్తరే;
తత్ప్రధానం హృదయం, తత్రేదం సమవస్థితం,
తదాదర్శః పదార్థానాం, తత్కోశ స్సర్వసంపదాం;
సర్వేషామేవ జన్తూనాం, సంవిద్ధృదయ ముచ్యతే
నదేహావయవైకాంశో, జడజీర్ణోపలోపమః;
తస్మాత్సంవిన్మయే శుద్ధే, హృదయే హృతవాసనః
బలాన్నియోజితే చిత్తే, ప్రాణస్పన్దో నిరుధ్యతే ॥

25. సర్వోపాధులు వదలిన జ్ఞానరూపశివుఁడు నేనను నిరంతర శివోఽహం భావనవలన మనస్సులోఁగల సకలాశలను వదలుము.

శ్లో॥ సర్వోపాధి వినిర్ముక్తం,
చిద్రూపంయన్నిరన్తరం
తచ్ఛివోఽహమితిధ్యాత్వా,
సర్వాసక్తిం విసర్జయేత్ ॥

పరిమితిగలదేహభాగమా యగొమ్ముల్లోఁ
బడు హృదయ మదియు విడఁదగినది;
చిన్మాత్రముగ నెల్గు చేతనహృదయమే
గానఁదగినది యనుకొనుమనమున;
అది లోపలను నుండు; నది వెలి నుండు న
య్యది లోపలను వెలినుండు లేదు;
అదియె ముఖ్యహృదయము; మంగుండు నియ్యది;
యఖిలవస్తువులకునద్దమదియు,
ఎల్లసంపత్తుల కిల్లగు నది, గాన
నన్నిజీవులకు చిత్తగు హృదయము
అనఁబడు; శిలఁబోలు నస్థిరజడదేహ
మం దొక యవయవమై కాంశమగునె?
అందుచేఁ బరిశుద్ధమగు చిత్స్వరూపమా
నాహృదయమునందు హారముఁబూని

గీ॥ చలమనస్సుంచు సాధనవలన నాయు
చలనమును దనంతట నుపశమన మొందుఁ;
బలుభవములుగఁ బెంపొంది బలముకలిగి
వెలయు వాసనలన్నియు వీడిపోవు ॥

ద్వి॥ అన్నియుపాధులు నణఁగినయట్టి
జ్ఞానరూపశివుఁడు నేనన్న సతత
భావనచే మదిఁ బరఁగెడునట్టి
యఖిలాశలను నీవు త్యజియింపు, వత్స! ॥

కం॥ సకలోపాధులు వదలిన
యకలంకజ్ఞానరూపుఁ డా శివుఁ డేక ద
ప్పక యని యెపుడు 'శివోఽహ'మ
నుకొనుచో వదలుము సకలమనోగతవాంఛల్ ॥

26. సర్వావస్థలను విచారించి సత్యమైన పరమపద మును మనస్సున ధరించి, రామా, లోకమునఁ గ్రీడింపుము. నీవు సర్వవస్తువుల తత్త్వమును లెస్సగఁ దెలిసినవాఁడవు. కావున ఆదృష్టితో నీ కిష్టమైనట్లు లోకమునఁ గ్రీడింపుము.

27. ఉత్సాహానందములు గలవానివలె, తాపకోప ములు గలవానివలె లోకమున నటింపుము. సర్వాశాపాశ ములువీడి సర్వావస్థలయందు సముఁడవై వేషమునకుఁ దగి నట్లు పనులు బయటికిఁ జేయుచు, రామా, లోకమునఁ గ్రీడింపుము.

శ్లో॥ ప్రవిచార్యదశాః సర్వా, యదతుచ్ఛం పరంపదం
తదేవ భావే నాలంబ్య, లోకే విహర, రాఘవ;
జ్ఞాతవానసి సర్వేషాం, భావానాం సమ్యగ న్తరం
యథేచ్ఛసి తథా దృష్ట్యా, లోకే విహర, రాఘవ;
కృత్రిమోల్లాస హర్షస్థః, కృత్రిమోద్వేగ గర్హణః
కృత్రిమారంభ సంరంభో, లోకే విహర, రాఘవ;
ఆశాపాశ శతోన్ముక్తః, సమః సర్వానువృత్తిషు;
బహిః ప్రకృతికార్యస్థో, లోకే విహర, రాఘవ ॥

28. జ్ఞానముచే నింద్రియజయ మందినవాఁడే సత్యజ్ఞాన నిష్ఠుఁడైన యాత్మవిదుఁడు; జ్ఞానాగ్నిమయుఁడు; జ్ఞానవజ్ర

ద్వి॥ దశల నన్నిటి నీవు తద్ద శోధించి
పరము నెఱుచ్ఛమౌ పదము భావమున
నాలంబనముగొను; మన్నివస్తువుల
సమ్యగనశ్వరము విజ్ఞాతము నీవు;
ఆదృష్టిం గోఁగోరి నటు విహరింపు;
ఉల్లాసహర్ష సముద్వేగ గర్వా
ణారంభ సంరంభియౌ నితఁ డనఁగ
నాశలగు పాశము లన్నియు నూడ
సర్వవృత్తులయందు సమతనుబూని
ప్రకృతి కార్యస్థత బయటికిఁ దోఁప,
రాఘవా, లోకాన రాణఁ గ్రీడింపు॥

సీ॥ బహువిధదశలన్ని పరిశీలనముచేసి
సత్స్వగంపస మొగి తత్పదమును
హృత్తునఁగొని భువి నెన్నడుఁ గ్రీడింపు;
భావములన్నింట భావమదియు
తెలిఁగిలి; వాదృష్టి యెప్పుడుఁ విడువక,
యిలయందు వర్తిలు మిచ్ఛపగిది;
సంభ్రమ సంతోష సంతాపకోపస
మారంభసంరంభ ధారియనఁగ

గీ॥ వ్యాజముగ విహరింపు లో నమలుఁడగుచు,
నాశపాశముల్వీడియు, యన్నివృత్తు
లందు సమభావముగలిగి, యావనియందు
వేషయుక్తుఁడై, వెలినాడు, వీర, రామ॥

ద్వి॥ జ్ఞాన మింద్రియజయమే నికొసంగు
నతఁ డాత్మవిదుఁడు సత్యజ్ఞాననిష్ఠ

ధరుఁడు; కాలకాలుఁడు; మృత్యువును జేంపినమహావీరుఁడగువాఁడు.

శ్లో॥ విషయప్రతిసంహారం, యఃకరోతి వివేకతః
మృతో్యర్మృత్యు రితిఖ్యాతః, సవిద్వానాత్మవిత్కవిః
జ్ఞాన సద్భావ సంస్థానః, జ్ఞానాగ్నిః జ్ఞానవజ్రభృత్
మృత్యుహన్తేతి విఖ్యాతః, మహావీరో విమత్సరః॥

29. తత్త్వదర్శికి బలమును బుద్ధియు తేజస్సును, వసంతకాలమందు వృక్షమునకు సౌందర్యాది గుణముల వలె, వృద్ధిఁజెందును.

శ్లో॥ బలం బుద్ధిశ్చ తేజశ్చ
దృష్టతత్త్వస్య వర్ధతే,
స వసన్తస్య వృక్షస్య
సౌన్దర్యాద్యాగుణా ఇవ.॥

30. మనసు దూరమున విడనాడి కథ వినువారివలె వాసన క్షయించిన మనసుగలవారు చేసినను చేయనివారే; వాసనాపూరితమనస్కులు చేయకున్నను కదలని దేహము గలవారయ్యుఁ గలయందు కొండనుండి క్రిందఁబడు వారి వలెఁ జేసినవారే యగుదురు.

శ్లో॥ అకర్తృ కుర్వదప్యేత
చ్చేతః ప్రతనువాసనం
దూరం గత మనాజన్తుః,
కథా సంశ్రవణేయథా;

జ్ఞానవజ్రధరుండు జ్ఞానాగ్నిమయుఁడు
కాలకాలుఁడు మృత్యుగర్వభంజకుఁడు ॥

తే॥గీ॥ జ్ఞానమున నింద్రియజయమ్ముఁ గన్నవాఁడె
సత్యసుజ్ఞానమునిల్పుస్వాత్మవిదుఁడు ;
వాఁడె జ్ఞానవహ్నియు, జ్ఞానవజ్రధరుఁడు,
కాలకాలుఁడు మృత్యుఁజేంపు గట్టిమగఁడు ॥

ద్వి॥ దృష్టతత్త్వానకును దేహంబు బలము
బుద్ధియుఁ దామగా బుద్ధిని గనును;
తిరుపు వసంతవేళరహించునపుడు
అందమూది గుణము లతిశయించెడిని. ॥

ఆ-వె॥ తత్త్వవీక్షకునకుఁ దాముగా వృద్ధియౌ
బుద్ధి బలము తేజు భువనమందు,
కలదుఁగా వసంతకాలము తిరుపున
కందమాదిగొనము లడరునట్లు. ॥

ద్వి॥ మనము సంక్షీణవాసన మైనవారు
మనము దూరము పంపి వినువారు కథను
చేసియు వారలు చేయనివారె;
వాసనాఘ్రాతితుల్ వర్తింపకున్నఁ,
గదలని దేహంబు గలిగియయున్న,
స్వప్నాన గిరినుండి పడువానిఁ బోలి,
చేయకయున్ననుఁ జేసినవారె. ॥

సీ॥ మనసు వేఱొకచోట మగ్నమై యుండఁగాఁ
గథను నూఁకొనువానికరణి, మనసు
వాసనారహితమై పలులు సేవ్యానికి
సతఁడు చేసియుఁ జేయునట్టి వాఁడె;

అకుర్వ్వదపి క ర్త్రైవ,
చేతః ప్రఘునవాసనం
నిష్పన్దాఙ్గమపి స్వప్నే
శ్వభ్రపాతస్థితావివ.॥

31. దేహములో నిద్దురించే నాత్మజ్ఞానియొక్క వ్యవహారసమాధినిద్రలు బండిలో నిదురించే వానికి బండిపోవుట, నిలుచుట, విప్పియుండుటలకు సమానమే.

శ్లో॥ సుప్తస్యాత్ర యథా రథే రథగతిః
స్థానంచ తస్య క్వచిత్
తస్యైవాశ్వవియోజనంత్రయమిదం
జానీహితత్త్వద్భవేత్
దేహేఽస్మిన్ విగతాత్మధీః స్వపితియః
స్వస్మిన్ స్థితో నిశ్చలః
తస్యైతత్త్రితయం క్రియాచ వపుషో
నిష్ఠాపి నిద్రాపిచ.॥

32. జాగ్రత్స్వప్నసుషుప్తు లను మూఁటినే చూచే వారికి జాగ్రత్సుషుప్తి యను నాల్గవదిగఁ జెప్పఁబడు నాతురీయమే వాస్తవమై ఆ మూఁడును లేమిచే తురీయాతీతమగును.

వాసనాభరిత మెహ్వాని మానసము వాఁ
డొకటియు నొనరింపకున్న నైనఁ
గదలని దేహంబుగల్గువాఁ డయ్యును
గలలోన గిరినుండి కాలు జారి

సీ॥ క్రిందఁబడెడువానిక్రియను, సకలంబును
జేసినట్టివాఁడ సిద్ధమగుఁడు;
కానఁ గర్త ననెడు గర్వంబు విడనాడి
నిజము తెలిసికొనుచు నిలువవలయు.॥

ద్వి॥ ఆత్మజ్ఞుఁడై మేనియందు నిద్రించె
మనుజా వ్యవహృతి సమాధి నిద్రలును,
బండి నిద్రించునకు బండిపోవుటయు
నిలుచుట విప్పియున్కియు నట్లొ యట్లె.॥

తే-గీ॥ తనువులోన నిద్రించె నాత్మజ్ఞుని వ్యవ
హారము సమాధి నిద్రయు నరయఁగాను
బండి నిద్రించువాని కాబండిచేనుట
నిలుచుటయు విప్పియునికియువలెనె యుండు.॥

ద్వి॥ కల జాగ్రతయు సుషుప్తులను నాత్రయమె
చూచువారికి, వత్స! శుద్ధసత్త్వమ్మె
జాగ్రత్సుషుప్తి వాచ్యము తురీయమ్మె;
అదె తురీయాతీత మాత్రయు లేమి.॥

శ్లో॥ జాగ్రత్స్వప్నసుషుప్తిషు స్థితిజుషాం
యత్తుర్యమిత్యుచ్యతే
జాగ్రత్సుప్తిమయం పదం స్వవిదుష
శ్శాన్తం శివం కేవలం
సత్యం తద్ధిపదం మృషేతరదిదం
త్వాభాసమాత్రంత్రయం
తుర్యాతీత మత స్తదేవమునయ
శ్శంస న్తి సంవిన్మయం.॥

౭౩. జ్ఞానికి సంచితాగామ్యములు కలుగవు; ప్రారబ్ధము మిగులు ననుట పరుల ప్రశ్నకుఁ బలుకుమాట; భర్త పోయిన తర్వాత వైధవ్యమును బొందని భార్య మిగుల కున్నట్లు కర్తపోయినఁ గర్మత్రయము మిగులదని కనుము.

శ్లో॥ కర్మాగామిచ సఞ్చితంచ విదుషో
నష్టే భ వేతాంధ్రువం
ప్రారబ్ధం నవినశ్యతీతి గదితం
గ్రన్థేషుమన్దాన్ప్రతి
పత్న్యేకా నసుమఙ్గలీ పతిమృతౌ
బహ్వీషు యద్వద్భవేత్,
ఏవం కర్తరి బాధితే ప్రవిలయం
కర్మత్రిధాయాస్యతి.॥

తే-గీ॥ కల మెలఁకువ నిదుర మూఁడె కను జనులకు
నాల్గవదిగ జాగ్రత్సుషుప్తి నాఁబడునది
యా తురీయము; యరయఁగా నదియె సత్య
మగు, యగును దురీయాతీత, మవియు లేమి.॥

ద్వి॥ "జ్ఞానికి సంచితాగాములు లేవు,
ప్రారబ్ధ మొండె పోవకయుండు" ననుట
పరులప్రశ్నకు బదుల్ పలికెడుమాట ;
భర్తపోయిన వెన్క వైధవ్యహీన
మెలఁత యొక్కతెయును మిగులని యట్లు ;
కర్తపోయిన వెన్కఁ గర్మత్రయంబు
మిగుల దెట్టులునని, మిత్త్రుఁడా! కనుము.॥

తే-గీ॥ జ్ఞాని కుండవు సంచితాగాము, లైనఁ
బరఁగుఁ బ్రారబ్ధమనఁ బరప్రశ్న బదులె;
భర్త చేనఁగా విధవగాని భార్యయున్నె?
కర్త చెనెనేని మూఁడును కర్మలున్నె?॥

34. అల్పబుద్ధులకు పుత్త్రి భార్యాది సంసారముండు రీతి, విద్వాంసులకు అనేక శాస్త్రసంసారములు ధ్యానమునకు ఆటంకము నొనర్చునవియై లోపలఁగలవు.

శ్లో॥ పుత్త్రదారాది సంసారా
తద్భవ స్త్వల్పచేతసాం
విదుషాం శాస్త్రసంసారో
యోగాభ్యాసస్య విఘ్నకృత్.॥

35. లిపి అనఁగా విద్యఁ నెఱింగిన తాను పుట్టు చోటు ఎదియని యెంచి (తెలిసి) లిపిని అనఁగా తల వ్రాఁతను లేక కర్మను దొలఁగింపఁ దలంపనివాఁడు లిపిని ఎఱింగి అనఁగా జ్ఞానము గలవాఁడై నను ఫలమేమి? అట్టి వారు శబ్దగ్రహణయంత్ర (Gramophone) తుల్యులేగాని వేఱెవ్వరు? శోణేశా, చెప్పుము.

శ్లో॥ యాహన్తా లిపి బోధమానమయుతే
జాయేత సేఽయంకుతః
ఇత్యన్విష్య లిపిప్రమార్జనకృతే
మర్త్యో లిపి జ్ఞానవాన్;
మాయాంధోనయతేతచే ద్వద లిపి
జ్ఞానాత్ స కిం లబ్ధవాన్
కోవాన్యో స్త్వరుణాచలేశ, భువనే
వాగ్యన్త్రతుల్యోనరః?॥

36. చేదివియు శాంతిని బొందనివారలకన్న చేదువని వారే చాల బ్రదికినవారు; పట్టుకొనుచున్న మదపిశాచము

ద్వి॥ అల్పబుద్ధులకు దారాత్మజులట్లు
విద్వాంసులకు శాస్త్రవితతిరూపమున
సంసారములు ఘ్యాససాధనాగోధ
కంబులు లోపలఁ గల వనేకములు.॥

తే-గీ॥ అల్పబుద్ధులకు సుతదారాదియుక్త
మైన సంసారముం జేసు నట్లనేక
శాస్త్రసంసారముల్ ఘ్యాససరణి నద్ద
పఠించినవారు లోనుంచు విద్వాంసులకును.॥

ద్వి॥ లిపి నెఱింగినఁ దాఁ దెలిసి తేనమూల
మెది యని కని లిపి నేఁ దనివాఁడు
లిపి నెఱింగియును ఫలితమేమి కలదు?
శబ్దగ్రహణాయత్తసముఁడు, శోణేశ!॥

ఉ॥ వ్రాఁత నెఱింగినందులకు
వారక తా ముదయించుచో నెదో
వ్రాఁతగఁ దా మెఱింగి తల
వ్రాఁతఁ దలంగఁ దలంపకున్నచో
వ్రాఁత నెఱింగి లాభ మెది?
వాగలు కారాకా శబ్దముద్రిణీ
ఖ్యాతవిచిత్రయంత్రసము
లారయ? శోణగిరీశ! చెప్పుమా.॥

ద్వి॥ చదివియు శాంతిఁ గాంచనివారికన్నఁ
జదువని వారెగా బ్రదికినవారు;

నుండి బ్రదికినారు; చలన మొందు చింతాక్లేశవాక్క్లేశ రోగ ములనుండి బ్రదికినారు; కీర్తిసమ్మానములకొఱకు తిరుగు (పరుగిడు) దేహబాధలనుండి బ్రదికినారు. వారు బ్రదికినది ఒకటినుండి కాదని యెఱుఁగుము.

శ్లో॥ పాణ్డిత్యం సముపేత్యయోనభజతే
శాన్తింతతోఽపణ్డితో
మర్త్యో ధన్యతరో మదేనగురుణా
భూతేన నో గృహ్యతే
సమ్మానస్య కృతేఽటనంనకురుతే
క్లేశంచ వాక్చిత్తయోః
నైవాప్నోతిచ నైకతోఽయ మశుభా
న్ముక్తోహ్యవిద్వాన్నరః.॥

37. అఖిలలోకములను తృణతుల్యముగఁ దలంచిన వారై నిఖిలరహస్యములను కరతలమునఁ గలవారై యున్నను, పొగడ్తయను వేశ్యాదాస్యమునుండి విడివడుట మిక్కిలి దుర్లభము.

శ్లో॥ తృణతులితాఖిలజగతాం
కరకలితాఖిలనిగమరహస్యానాం

మదపిశాచముబారి వదలిపోఁ గనిరి;
చలియించు చింతవంతల విడనాడి
వ్యాక్లైన రోగముల్ వదలిపోఁ గనిరి;
సమ్మానములఁ గీర్తి సాధింపఁబూని
తిరుగుట నగుపట్టి దేహబాధలను
దలఁగి రవ్వారలు తప్పించుకొన్న
దొకదానినుండి కాదోయి? కుమార!॥

సీ॥ చదివియు శాంతిఁగాంచనివారికంటెను
బదువని వారలే చాల బ్రదుకుఁ
గనినవారలు; పట్టుకొని వీడకున్నట్టి
మదపిశాచమునుండి బ్రదికినారు
తరళస్వభావ చింతాక్లిష్ట వ్యాక్లైన
భగరోగములనుండి బ్రదికినారు;
సమ్మానకీర్తుల సముపార్జింపఁబడ్డ
లాడు దేహవ్యథ లందునుండి
గీ॥ బ్రదికినా; రిట్లు వారలు బ్రదుకఁగనిన
దొకటినుండియె గాదని యెఱిగి నెఱుంగు;
అన్నిబంధకములనుండి యరయవారు
తప్పుకొని బ్రదికిరనుట తథ్యము విను.॥

ద్వి॥ తృణరీతి లోకాల గణనచేసినను,
నఖిలరహస్యముల్ హస్తమందున్న,
ధరను సంస్తుతివేశ్యదాస్యమ్ముఁ దలఁగు
త్రోవ లభించుట దుర్లభ, మయ్య!॥

చ॥ భువనము లన్నియున్ దృణముఁబోలెఁ దలంచెడువారలైన, గా
గపనిఖిలార్థగోప్యవివరంబు లవెల్లఁ గరస్థమైనను,

శ్లాఘా వారవధూటీ
ఘటదాసత్వం సుదుర్నిరసం.॥

38. తానులేనివారు ఎవ్వరుగలరు? తన్నెవ్వరేది చెప్పిన నేమి? తన్నుఁ దానే పొగడుకొనినను దిట్టుకొనినను ఏమియున్నది? తాను, ఇతరులు, అని చూడక తన స్థితిని వీడక తా నెప్పుడు తనయందే యుండవలయును.

శ్లో॥ కోవాన్యో భవతి స్వతః (?) స్వ విదుషః
తావాక్షతిః కోఽపిచేత్
నిన్దాం స్వా మథవా నుతిం వితనుతే
నిన్దానుతిర్వా నిజా?
స్వేనో క్తైవహితస్య యః పర ఇతి
స్వ శ్చేత్యకుర్వన్విభిదాం
స్వస్మిన్నేవపదే భజత్యవిచలాం
నిష్ఠాంమునీన్ద్రః పరాం.॥

39. అద్వైతభావ మెప్పుడు నుండవలెనే తప్ప అద్వైతాచరణ మెప్పుడును సలుపవలదు. మూడులోకము లతో అద్వైతముండినను గురువుతో మాత్ర మది కూడదు.

శ్లో॥ భావాద్వైతం సదాకుర్యాత్,
క్రియాద్వైతం నకర్హిచిత్,
అద్వైతం త్రిషులోకేషు,
నాద్వైతం గురుణా సహ.॥

లనము పోగడ్తుంచుక వెలవెలాసెని దాస్యమునుండి మోక్షణం
బవుట సరంబు దుర్లభ మూరాగ! జగమ్మున నెల్లవారికిన్.॥

ద్వి॥ తాను లేనట్టి యేప్రాణియుఁ గలదె?
తన్నెవ్వ గేమేని యన్నను నేమి?
తనుఁ దిట్టుకొనఁ దన ఘనతఁ జాటింప
నేమగుఁ? గానఁ దా నితరులం చెనక
తనస్థితి వీడక తన్నెప్పు డెఱిఁగి
తనయందె యున్నచో ధన్యుఁడు, వత్స!॥

తే-గీ॥ తాను లేకున్న వారలు ధరణిఁ గలరె?
తన్ను నెవరేని యేమేని యన్న నేమి?
పొగడ నేమగుఁ దనుఁ దాన, తెగడ నేమి!
తా నితరులంచు భేదమ్ముఁ దలఁపకుండ,
స్వస్థితిని వీడ కందుండవలయు నెపుడు.॥

ద్వి॥ చెందు మద్వైతమ్ము చిత్తమం దెపుడుఁ;
జెంద కద్వైతమ్ము చేష్టయం దెపుడుఁ;
బొందు మద్వైతమ్ము ముల్లోకములను;
గూడ దద్వైతమ్ము గురునితో నెపుడు.॥

తే-గీ॥ చెందు మద్వైత మెప్పుడున్ జింతయందు;
చెంద కద్వైత మెప్పుడున్ జేష్టయందు;
పొంద నద్వైతమగు మూఁడు భువనములను;
గూడ దద్వైత మెప్పుడున్ గురునితోడ.॥

40. సకల వేదాంతసిద్ధాంతసారమును సంగ్రహించి చెప్పెదను వినుము. "నేను" జచ్చి తానుగ వెలుఁగుఁగ తానే మిగిలియుండు వస్తువు.

శ్లో॥ సర్వవేదాన్త సిద్ధాన్త
సారం వచ్మియథార్థతః
స్వయంమృత్వా స్వయంభూత్వా
స్వయమేవావశిష్యతే.॥

ద్వి॥ తత వేదశీర్ష సిద్ధాంతసారంపు
సంగ్రహమ్ము వచింతుఁ జక్కఁగ వినుము;
"నేను" చచ్చియుంతఁ దానుగా వెలుఁగఁ;
దాన శేషించు సద్వస్తువు, వత్స.॥

ఆ-వె॥ సంగ్రహము వచింతు సకలవేదాంతసి
ద్ధాంతసారమునకు; దాని వినుము;
"నేను" జచ్చి తానుగానె భాసిల్లఁగ,
మిగిలియుండు వస్తువగును దానె.॥

# పరిశోధనపత్రము

| ప్రక్క | పఙ్క్తి | అశుద్ధము | శుద్ధము |
| --- | --- | --- | --- |
| 2 | 15 | హృదయ మను | హృదయమం దుండుటచేత హృదయ మను |
| 4 | 4 | దృడ్డైవ | దృఢ్ఢైవ |
| ,, | 11 | ర్మృణ్య | ర్మృత్య |
| 7 | 5 | కల ..... గాదె; | కల ........ గాదె; పలుచిత్రనామాకృతులు జూచువారు, |
| 11 | 6 | యాముల | యామ్ముల |
| 35 | 20 | మెష్డ | మెప్పడ |
| 58 | 14 | చ్చిర్య | చ్ఛిర్య |
| 62 | 20 | విసర్జ | వివర్జ |